# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**0-75** పైసలు

సంవత్సర చందా
రూ. **8-40**



## జలుబు నొప్పులతో మీ బిడ్డను బాధపడనీయకండి

**విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది... మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది... రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు**

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కు నుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేత నంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా వరుండబెట్టండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

# పిల్లలకు అందమైన బొమ్మల కథల పుస్తకాలు

**ఆలీబాబా 40 మంది దొంగలు** | **అల్లాఉద్దీన్ అద్భుతదీపం**

కథలు అందరు ఎరిగినవే, అయినప్పటికిన్నీ ఆకర్షవంతమైన రంగురంగుల వాష్ చిత్రాలతో సులభమైన పదాలతో, ముచ్చట గొలిపే ముఖచిత్రాలతో, చిన్నపిల్లలకు అర్థమగు విధంగా క్లుప్తంగా కూర్చబడి—నాణ్యమైన కాగితంమీద అందంగా ముద్రించి తయారు చేయబడుటయే వీని ప్రత్యేకత. ఈ పుస్తకములు చిన్న పిల్లలకు ఎంతగనో ఉపకరిస్తవి. చదువుతూనే అనేక సార్లు బొమ్మలు చూచుటవల్ల కథ చక్కగా అర్థంకావడమే కాక బాగా జ్ఞాపకం ఉంటుంది.

ఇంత చక్కని పుస్తకములు తెలుగు - తమిళం - కన్నడ భాషలలో తయారయినవి.

ఏ భాషలోనైనా ఒక్కొక్క పుస్తకం రూ. **2-25** (పోస్టేజి అదనం)

**హిగ్గిన్‌బాదమ్స్ ప్రైవేటు లిమిటెడ్,**

165, మౌంటురోడ్డు :: మద్రాసు - 2

---

## గొంతుగ నొప్పి?

## పెప్స్

## తీసుకోండి !

పెప్స్ బిళ్లలను మెల్ల మెల్లగా చప్పరించండి. అందరి కనుపకరమైన, ఆరోగ్యవంతమైన ఆవిరులను ఆస్వాదించిన వెంటనే మీకు నివారణ కలుగును... దీని వలన గొంతుగ నొప్పి మరియు రొమ్ము వెంకరి వాపులకు నివారణకలుగును... దగ్గు మరియు జలుబును కలుగజేసే క్రిములను నిర్మూలించుటకు ఇది సహాయపడును. మీరు త్వరితంగానే నివారణను పొందగలరు.

- ★ జలుబు మరియు గొంతుగ నొప్పికి బాధాకరమైనది.
- ★ పిల్లలకు సురక్షితమైనది.

## పెప్స్

శీఘ్రముగా నివారణ నొసగును.




---

ఆంధ్రప్రదేశ్‌కు పంపకదార్లు : Ms. వినోద్ అండ్ కో., 15/9/521-24, జవహర్లాల్ నెహ్రూ రోడ్, (మహబూబ్‌గన్జ్), తపాలు పెట్టె నం. 148, హైదరాబాదు - 12.

# అమ్మా, అమ్మా, ఇంకొక్కటి

పిల్లలకు పెద్దలకుకూడా పుష్టికరము రుచికరము అగు ప్యారీ మిఠాయిలు అనివార్యము. మీరుకూడా ప్యారీ మిఠాయిలను ఎక్కువగా ఆస్వాదిస్తారు. విడిగానో లేక అందంగానో అచ్చువేసిన ఫ్యాన్సీ డబ్బాలలోనో కొనండి. అందరికి ఇవ్వండి. ప్యారీ మిఠాయిలతో జీవితం వినోదంగాను, విలాసంగాను గడిచిపోతుంది.




విశిష్ఠరకపు మిఠాయిలు తయారుచేయువారు

పీటవి వాడారా : లెమన్ బార్లీ కోకోనట్స్
—మిల్క్‌టాఫీ—జింజర్ క్యాప్స్—సూపర్ బట్టర్ స్కాచ్

JWT/PRS/3279

ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఆర్యులు మొదట్లో ఉత్తరధ్రువ ప్రాంతంలో ఉండేవారనీ, ఆ ప్రాంతాన్నే తరువాత మన వాళ్ళు స్వర్గంగా పరిగణించి, అక్కడి వారిని దేవతలుగా భావించారనీ అనుకోవటానికి కొన్ని ఆధారాలున్నాయి. మనకు ఒక సంవత్సరమైతే దేవతల కొక రోజని పురాణాలు చెబుతున్నాయి. ధ్రువప్రాంతంలో కూడా ఆరు నెలలు పగలూ ఆరు నెలలు రాత్రీ. వీటిని బట్టి "యముడి మరణం" అన్న కథ అతిప్రాచీనకాలపు ఆర్యగాథ అవుతుంది.

"మాయమైన బియ్యం" కథ ఈనాటి పరిస్థితులను చాలావరకు జ్ఞాపకం చేస్తుంది. బియ్యాన్ని ఈ రోజులలో మాయం చెయ్యగల వారు మంత్రాలను ఉపయోగించరు, కాని వారు కూడా దేశద్రోహులే.

సంపుటి : 38 - జనవరి 1966 - సంచిక : 1



# భారత చరిత్ర



ఔరంగజేబు పరిపాలనా కాలంలో సగం ఉత్తరదేశ వ్యవహారాలు చూడటంలోనే గడిచిపోయింది. దక్కను (దక్షిణదేశ) వ్యవహారాలను ఆయన వైస్రాయిలు (రాజ ప్రతినిధులు) చూస్తూవచ్చారు. దక్కను లోని సుల్తానులు తాము తిన్న దెబ్బల నుంచి కోలుకోని కారణంగా అక్కడ మహారాష్ట్ర సామ్రాజ్యం దృఢపడి, మొగలు సామ్రాజ్యానికీ, అధికారానికీ సవాలుగా నిలబడ సాగింది.

ఈ సంగతి మొదట ఔరంగజేబు గుర్తించ లేదు. తన కొడుకు అక్బరుకూ, మహారాష్ట్రరాజు శంభాజీ (శివాజీ కొడుకు)కీ సఖ్యత పొసగటం చూసి ఔరంగజేబు తన దక్కను విధానాన్ని మార్చుకున్నాడు. ఆయన మేవారుతో సంధి చేసుకుని, 1681 జూనులో సైన్యసమేతంగా దక్కనుకు బయలుదేరాడు.

అక్బరును పట్టుకొనటానికి ఔరంగజేబు నాలుగేళ్ళు పాటు విశ్వప్రయత్నం చేశాడు; మహారాష్ట్రులతో యుద్ధాలు చేసి విఫలుడయాడు. కొన్ని మహారాష్ట్ర దుర్గాలను మొగలులు జయించిన మాట నిజమే గాని, శివాజీ చేత ఉత్తేజితులైన మహారాష్ట్రులను అణచివెయ్యటం సాధ్యం కాలేదు.

అటు తరవాత ఔరంగజేబు దక్కను సల్తనతులను జయించే పనికి పూనుకున్నాడు. 1685 ఏప్రిలు 11 న మొగలు సేనలు బిజాపూరును ఆఖరుసారి ముట్టడించాయి. మరుసటేడు జులైలో ఔరంగజేబు స్వయంగా అక్కడికి వెళ్ళాడు. ఆదిల్‌షాహీ వంశానికి ఆఖరు వాడైన సికందర్ సుల్తాను చక్రవర్తికి లొంగిపోయాడు. యూసుఫ్ ఆదిల్‌షా వంశం అక్కడితో అంతమయింది. ఔరంగజేబు బిజాపూరునగరం ప్రవేశించి సికందర్ రాజభవనం లోని చిత్తరువులనూ,

## 52. ఔరంగజేబు—దక్కను విజయాలు

కుడ్య చిత్రాలనూ పూర్తిగా ధ్వంసం చేయించాడు. బిజాపూరు స్వాతంత్ర్యం కోల్పోవటమే గాక పాడుపడిపోయింది కూడా.

1687 ఫిబ్రవరిలో ఔరంగజేబు తన బలాలను గోల్కొండకు తీసుకుపోయి కోటను ముట్టడించాడు. ఈ ముట్టడిని గోల్కొండ 8 మాసాల పాటు విజయవంతంగా ప్రతిఘటించింది. గోల్కొండ సుల్తాను అబుల్‌హసన్ కొలువులో ఉంటున్న అబ్దుల్లాపనీ అనే అఫ్ఘాన్ వాడు ఔరంగజేబుకు అమ్ముడుపోయి, కోట ముఖద్వారం తెరిచి, మొగలు సేనలను కోటలో ప్రవేశించనిచ్చాడు. గోలకొండ ఔరంగజేబు వశమయింది.

అబుల్‌హసన్ దౌలతాబాదుకు వెళ్ళిపోయి, ఏడాదికి 50,000 రూపాయల భరణం తీసుకున్నాడు.

దక్కను సల్తనతులను వశపరచుకున్నాక ఔరంగజేబు మహారాష్ట్ర విజృంభణను అణచటానికి పూనుకున్నాడు. ప్రారంభంలో అయన ప్రయత్నాలు విజయవంతమయాయి. 1689 మార్చి 11 న శంభాజీ మరణ శిక్ష పొందాడు. రాయగఢ్ పట్టుబడింది. అయన తమ్ముడు రాజారాం ఒక్కడే మొగలులకు చిక్కకుండా పారి



పోయాడు. మిగిలిన అయన కుటుంబం ఖైదీలుగా పట్టుబడింది.

అటు తరవాత తంజావూరు, తిరుచినాపల్లి రాజ్యాలు కూడా ఔరంగజేబుకు లోబడి కప్పాలు కట్టాయి. 1690 నాటికల్లా ఔరంగజేబు దాదాపు యావద్భారతానికి సామ్రాట్టు అయాడు. అయితే ఈ ఉచ్చదశే ఆయన పతనానికి నాంది కూడా అయింది. ఇంతగా విస్తరించుకున్న మొగలు సామ్రాజ్యాన్ని ఒక్క రాజధాని నుంచి ఒక్క వ్యక్తి పాలించటం సాధ్యమయే పనికాదు. ఔరంగజేబుకు అంతటా శత్రువులు పుట్టుకొచ్చారు. వారిని జయించ

వచ్చుగాని, అణచివెయ్యటం సాధ్యం కాదు. ఉత్తర భారతంలోనూ, మధ్య భారతంలోనూ అరాజక పరిస్థితు లేర్ప డ్డాయి. పరిపాలనలో తాత్సారమూ, అవినీతీ ప్రబలింది. దక్కనులో మారుమూల ఉన్న చక్రవర్తికి తన ఉద్యోగులను అదుపుచేసే దారిలేదు. రాజపోషణ లేని కారణంచేత కళాసంస్కృతులు ఏనాడో దెబ్బతిన్నాయి. సుదీర్ఘమైన ఔరంజేబు పరిపాలనా కాలంలో ఒక చక్కని కట్టడం గాని, కళాఖండంగాని, కావ్యం గాని ఔరంగజేబు పరిపాలనకు అంకితం కాలేదు. దక్కను యుద్ధాలతో ఖజానా ఖాళీ అయింది. స్థానిక పాలకులూ, జమీందార్లూ రాజశాసనాన్ని ధిక్కరించి యథేచ్ఛగా ప్రవర్తించారు. జీతాలు సక్ర మంగా ముట్టక సైనికులు తిరుగుబాటు చేశారు. చక్రవర్తి కుటుంబ పోషణకూ, సేనకూ బెంగాలు నుంచి గడువు తప్ప కుండా వచ్చే కప్పమే ఆధారమయింది.

ఇంత జరిగినా మహారాష్ట్రులు లొంగి రానేలేదు. 1691 లో వారు తిరిగి తమ శక్తులను కూడగట్టుకుని మొగలులపై జాతీయసమరం సాగించారు. వారికి కొంత కాలంపాటు రాజారాం నాయకత్వం వహిం చాడు, 1700 లో రాజారాం మరణా నంతరం వీరనారి అయిన అయన భార్య తారాబాయి మహారాష్ట్రులకు నాయకత్వం వహించింది.

శిథిల మవుతున్న తన సామ్రాజ్యాన్ని ఎలాగైనా కాపాడుకుందామని ఔరంగజేబు దాన్ని తన కొడుకులకు విభజించుదా మనుకున్నాడు. కాని కొడుకులు తండ్రి మాట వినలేదు. 1707 మార్చి 3 న ఔరంగజేబు అహ్మద్‌నగరులో ప్రాణాలు విడిచాడు. అయన భౌతిక దేహాన్ని దౌలతా బాదుకు తెచ్చి, బుర్‌హానుద్దీన్ అనే ప్రఖ్యాత ముస్లిముసాధువు సమాధి ఉండే ఆవర ణలో సమాధి చేశారు.



# నేహ్రూ కథ

## 19



జవాహర్ రెండవసారి జైలు నుంచి బయటికి వచ్చేసరికి కాంగ్రెసులో స్వరాజిస్టులకూ, వారి వ్యతిరేకులకూ తేడాలు చాలా తీవ్రంగా ఉన్నాయి. స్వరాజిస్టులు శాసన సభా ప్రవేశోద్యమంలో మునిగిపోయారు. వారి వ్యతిరేకులు పైకి గాంధీ అనుచరుల మని చెప్పుకున్నారే గాని వారిలో కూడా ఏమంత పస లేదు. వారు చాలావరకు సంఘసంస్కరణల కొరకు మడిగట్టుకున్న వాళ్ళు. వారు చేసిన మంచిపని ఏమిటంటే, ప్రజలకు సన్నిహితంగా ఉండటం.

జవాహర్ విడుదల అయాక దేశబంధు దాసు అతన్ని తమ స్వరాజిస్టు రాజకీయాలలోకి లాగాలని యత్నించాడు. జవాహర్ అందుకు ఒప్పుకోలేదు. మోతీలాల్ తన కొడుకును తమ పక్షానికి తిప్పుకోవాలని ఎలాటి ప్రయత్నమూ చెయ్యలేదు. తన కొడుకు తన పక్షం చేరితే ఆయన ఎంతో సంతోషించి ఉండును; అయినా ఆయన తన కొడుకు భావస్వాతంత్ర్యాన్ని గౌరవించాడు. రాజకీయాలలో మోతీలాల్, దాసుల మధ్య అపూర్వమైన అన్యోన్యత ఏర్పడింది. వారిలో ఎవరు ఏ చర్య తీసుకున్నా రెండో వాళ్ళు తాము అనుమతించినట్టే వ్యవహరించారు. ఈ అన్యోన్యత కారణంగానే స్వరాజిస్టులకు ప్రజలలో ఆదరణ హెచ్చిందని జవాహర్ నమ్మకం. అయితే స్వరాజిస్టులలో పదవీ వ్యామోహం గలవారూ, ప్రభుత్వంతో సహకరించాలనే మితవాదులూ చేరారు. ఎన్నికలు కాగానే ఇలాటి ధోరణులు స్పష్టమయాయి. ఇలాటి "దుష్టాంగాలను" ఛేదించటానికి కంకణం కట్టుకుని మోతీలాలు అన్నంతా చేశాడు.

1923 నుంచీ జవాహరుకు కుటుంబ జీవితం చవి చూసే అవకాశం లభించింది.



అయితే, తాను ఆర్థికంగా తండ్రి పైన ఆధారపడి ఉండటం మటుకు జవహరును చాలా బాధించింది. అతని శక్తులన్నీ దేశ సేవకూ, పురపాలన కార్యకలాపాలకూ అంకిత మయాయి. అతను ధనార్జన కోసం ఇంకొక పని ఏదైనా చెయ్యవచ్చు, కాని తా నిప్పుడు చేస్తున్న ప్రజాసేవ దెబ్బ తింటుంది. జవాహరు పేరు ఉపయోగించుకునే ఉద్దేశంతో కావచ్చు, కొన్ని పారిశ్రామిక సంస్థలు పెద్ద జీతాల మీద అతనికి ఉద్యోగాలిస్తా మన్నాయి. ఆ ఉద్యోగాలను జవాహరు ఆమోదించలేదు. పెద్ద పరిశ్రమలతో అలాటి సంబంధం పెట్టుకోవటం అత



నికి ఇష్టంలేదు. ప్లీడరు వృత్తి చేసుకుందామంటే అతని కా వృత్తి పైన అసహ్యం నానాటికీ జాస్తి అవుతున్నది.

1924 కాంగ్రెసు (బెళగాం) సమావేశంలో కాంగ్రెసు ప్రధానకార్యదర్శులకు జీతాలు ఏర్పాటు చేయాలనే సూచన వచ్చింది. ఈ సూచనను జవాహరు ఆమోదించాడు. తమ కాలమంతా పనికి వినియోగించే వాళ్ళకు కనీసం భత్యమన్నా ఇవ్వకపోవటం అతనికి తప్పుగా తోచింది. అయితే జవాహరు జీతం పుచ్చుకోవటానికి మోతీలాలు తీవ్రంగా అభ్యంతరం చెప్పాడు. జవాహరు యొక్క సహకార్యదర్శి, ఎంతో డబ్బు అవసరంలో ఉన్నవాడై ఉండి కూడా, కాంగ్రెసు నుంచి డబ్బు పుచ్చుకోవటం అవమానకరంగా భావించాడు. అందుచేత జవాహరు కూడా జీతం లేకుండా పని చెయ్యవలిసి వచ్చింది.

తన ఆర్థికపరాధీనతకు జవాహర్ మూడేళ్ళపాటు పరిష్కార మార్గం తెలుసుకోలేక పోయాడు. ఆ విషయాన్ని అతను తన తండ్రి దగ్గిర ఒక్కసారే ప్రస్తావించాడు. "కొద్దిపాటి డబ్బు కోసం దేశసేవకు వినియోగించే కాలాన్ని నువు ఉద్యోగంలో ఖర్చు చెయ్యటం దేనికి? నీకూ, నీ భార్యకూ





ఏడాది పొడుగునా సరిపోయేటంత డబ్బు నేను కొద్ది రోజులలో సంపాదించగలను," అన్నాడు మోతీలాలు.

స్వరాజిస్టులకూ, వారి వ్యతిరేకులకూ మధ్య ఘర్షణ జుగుప్సాకరమైన రూపం దాల్చింది. 1923 శీతాకాలంలో జరిగిన ఢిల్లీ కాంగ్రెసులో స్వరాజిస్టులది పై చెయ్యి అయింది. ఈ సమావేశం ముగుస్తూనే జవాహరు అరెస్టయాడు. ఇదొక అంతర్నాటకం.

పంజాబులో ప్రభుత్వానికీ, సిక్కులకూ, ప్రత్యేకించి అకాలీలకూ సంఘర్షణలు జాస్తిగా సాగుతూ వచ్చాయి. వారిలో మత పునరుద్ధరణోద్యమం బయలుదేరింది. గురుద్వారాలలో ఉండే అవినీతిపరులైన మహంతులను వెళ్ళగొట్టి, వారి ఆస్తులను ఉద్యమకర్తలు స్వాధీనపరుచుకో సాగారు. గురుద్వారోద్యమం జాతీయోద్యమంలో అంతర్భాగం కావటమే గాక, దాని లాగే అహింసాయుత సత్యాగ్రహం రూపంలో కొనసాగింది. గురుకాబాగ్ ఉద్యమంలో అనేకమంది సిక్కు మాజీసైనికులు భయంకరంగా పోలీసుల చేత లాఠీదెబ్బలు తిన్నారు. వారు ఉద్యమం విరమించలేదు, ఎదురుదెబ్బ తియ్యలేదు. వారి పట్టుదలా, ధైర్యమూ చూసి భారతదేశమంతా ఆశ్చర్య

వడింది. ప్రభుత్వం గురుద్వారా కమిటీని నిషేధించింది. కాని చివరకు సిక్కులు విజయం సాధించారు.

నెహ్రూ అరెస్టు సంఘటనకూ, ఈ గురుద్వారోద్యమానికి ప్రత్యక్ష సంబంధం లేదుగాని, పరోక్ష సంబంధం లేకపోలేదు. పంజాబులో పాటియాలా, నాభాలు రెండూ సిక్కు సంస్థానాలు. వీటి పాలకుల మధ్య వ్యక్తి వైరం ఉన్నది. ఈ వైరానికి పరిణామంగా ఇండియా ప్రభుత్వం నాభా మహారాజును పదవి నుంచి తొలగించింది. ఆ సంస్థానాని కొక బ్రిటిషు పాలకుడు ఏర్పాటు చేయబడ్డాడు. బ్రిటిషుపాలకుల ఈ చర్యకు నిరసనగా నాభా సంస్థానంలోనూ, దాని వెలుపలా కూడా ఉద్యమం సాగింది. ఈ ఉద్యమం జరుగుతున్న సమయంలో బ్రిటిషుపాలకుడు నాభాలోని జైతో అనే స్థలంలో జరిగే మతసంబంధమైన ఉత్సవాన్ని నిలుపు చేయించాడు.

బ్రిటిషుపాలకుడి ఈ చర్యకు నిరసనగానూ, ఉత్సవం తిరిగి కొనసాగించటానికిగానూ సిక్కులు "జత్థా"లను (దళాలను) జైతోకు పంపారు. ఈ జత్థాలను పోలీసులు లాఠీలతో బాది, ఏ అరణ్య ప్రాంతానికో తీసుకుపోయి, వదిలేసే వారు.

ఢిల్లీలో కాంగ్రెసు సమావేశం ముగిసే సమయానికి ఒక జత్థా నాభాకు బయలుదేరి పోతున్నట్టు జవాహరుకు తెలిసింది. అతన్ని కూడా తమ వెంట వచ్చి, ఏం జరిగేదీ చూడమన్నారు. జవాహరు వెంట ఏ. టి. గిద్వానీ, కె. సంతానం కూడా బయలుదేరారు. వారు జైతోకు సమీపంగా ఉన్న రైలుస్టేషను వరకూ రైలులో ప్రయాణించి, ఎద్దుబండి మీద నాభా సరిహద్దు లోపలికి చేరుకున్నారు. జత్థా కూడా ఆ సమయానికే అక్కడికి చేరుకున్నది. జవాహరు బృందం జత్థాతో కలిసి నడవక, దాని వెనకగా బండిలో వెళ్ళారు.






## 6

జగతసింహుడు సంకెళ్ళు తగిలించుకుని, సూర్యచంద్రుల దర్శనమైనా లేకుండా కారాగృహంలో పడి ఉన్నాడు. అది అతని సజీవ సమాధి. అన్ని ఆశలకూ అదే అంతం. అతని జీవితం అక్కడే ముగియాలి. ఆ సంగతి అతనికి తెలుసు, కాని అతనిలో ఆశ అన్నది చావలేదు. అదివరకు అతని కెన్నో కష్టాలు వచ్చాయి, తొలగిపోయాయి. దుర్దినాలు ఎల్లకాలమూ గూడుకట్టుకుని ఉండవు. మళ్ళీ మంచి రోజులు రావచ్చు.

అతనికి తాను పడే కష్టాల కన్న తిలోత్తమ పడే బాధను గురించి తలుచుకోవటం హెచ్చు కష్ట మయింది. ఎవరైనా తిలోత్తమ వార్త తెచ్చినా, లేక తా నెవరితోనైనా తన వార్త తిలోత్తమకు అందజేయఁగలిగినా అతని బాధ కొంత తగ్గును. కాని అది ఎలా సాధ్యం? చింత అతన్ని అహోరాత్రాలు నిద్రపోనివ్వకుండా బాధిస్తున్నది.

ఒకనాడు తెల్లవారుగట్ల అతనికి కాస్త కునుకు పట్టింది. అంతలోనే అందెల చప్పుడు వినిపించినట్టయింది. తరవాత తిలోత్తమ, చేత ఒక పుష్పమాల పట్టుకుని తన వద్దకు వచ్చింది. "నేను కత్తి అవతల పారేశానులే, పుష్పమాల ఇంక తెగదు," అని తను అన్నాడు. అంతలోనే అతనికి "యువరాజా!" అన్న పిలుపు వినిపించింది.

దామోదరముఖర్జీ





జగతసింహుడు కళ్ళు తెరిచి చూసేసరికి కల కరిగిపోయింది, ఎదురుగా తిలోత్తమకు బదులు కారాగారరక్షకు డున్నాడు.

"ఏం నాయనా, తూర్పు తెల్లవారకుం డానే ఏం సమాచారం తెచ్చావు?"

"తమరి నొక సన్యాసిగారు చూడా లంటున్నాడు."

"తీసుకు రాకపోయావా?"

"నాకు ధైర్యం చాలలేదు."

"అయితే ఆ మాట నా కెందుకు చెప్పటం?"

"వారిని లోపలికి పోనివ్వకపోతే మహా రాజుకు చాలాకోపం వస్తుందనీ, రాజకార్యా లన్నీ పాడవుతాయనీ ఆ సన్యాసి అంటున్నారు."

"దానికి నే నేం చెయ్యాను?"

"వారిని లోపలికి తీసుకొద్దా మను కుంటున్నాను."

"అయితే నాతో చెప్పటం దేనికి?"

"ఆ సన్యాసిని చూడటం మీ కిష్టమవు తుందో, కాదో అని."

"నీవు ఎప్పుడు ఎవరిని లోపలికి ప్రవేశ పెట్టినా నా కిష్టమే, తెలిసిందా?"

కారాగార రక్షకుడు వెళ్ళిపోయి అభి రామస్వామితో తిరిగి వచ్చాడు. ఆయనను చూడగానే జగతసింహుడు లేచి, పాదాభి వందనం చేసి, "ఇదేమిటి? మీ రిక్కడి కెలా వచ్చారు?" అన్నాడు.

"నే నిక్కడ ఎక్కువసే పుండటానికి లేదు. అందుచేత అసలు విషయం టూకీగా చెబుతాను. నీ శిక్ష గురించి తెలియగానే వచ్చి, ఇన్నాళ్ళూ ఇక్కడే ఉంటున్నాను."

"మందారవణలో అంతా కులాసా?"

"నీ కోసం అందరూ దుఃఖిస్తున్నారు. తిలోత్తమ దుఃఖానికి అంతేలేదు. నేను వచ్చాక నా శిష్యుడు దిగ్గజుడు విమల నుంచి ఒక ఉత్తరం తెచ్చాడు. నీకు కారా గార విమోచనం కలుగుతుందన్న ఆశతోనే

తిలోత్తమ ప్రాణాలు నిలుపుకుని ఉన్నట్టు విమల రాసింది."

"మీ రిన్నాళ్ళు ఏ ఉద్దేశంతో ఇక్కడ ఉన్నారు?"

"ఒకటి, నిన్ను చూడాలనీ; రెండు, నిన్ను విడిపించే ఉపాయం ఆలోచించాలనీనూ."

"నన్నెలా చూడగలిగారు?"

"కారాగార రక్షకుడికి బాగా బహుమానం ఇచ్చాను. నీతో కొద్దిసేపు మాత్రమే మాట్లాడనివ్వటానికి వాడు ఒప్పుకున్నాడు."

"నన్ను విడిపించటం సాధ్యపడుతుందనుకోను."

అభిరామస్వామి తన జోలె నుంచి ఒక కాగితం తీసి, "అంత బొత్తిగా నిరాశ పడకు. ఈ కాగితం పైన సంతకం పెట్టు. ఆ ప్రయత్నం కూడా సానుకూలం కావచ్చు," అన్నాడు.

"ఎలా ప్రయత్నిస్తారు?"

"పాదుషా దర్బారుకు వెళ్ళి."

"అక్కడ మనకు సహాయం చేసేవాళ్ళెవరు?"

"నవాబు నందిని ఆయుషా. ఆమె ప్రయత్నం మీదనే, ఆమె ప్రోత్సాహంతోనే ఇదంతా జరుగుతున్నది."



అభిరామస్వామి మాటలకు జగతసింహుడాశ్చర్యపడి, "ఆమె సహాయం ఎలా సంపాదించారు?" అన్నాడు.

"నేను సంపాదించలేదు. నిన్ను చెర విడిపించాలని ఆమె భూమ్యాకాశాలు తలకిందులు చేస్తున్నది. నేనామె ఆజ్ఞలు నిర్వర్తిస్తున్నాను. ఆమె ఇప్పుడీ పాట్నాలోనే ఉన్నది. నీ విజ్ఞాపన తీసుకుని ఆమె ఢిల్లీకి పోతుంది. అక్కడ అంతా సవ్యంగా జరిగిపోయి, తప్పక విడుదల అవుతావు."

ఆయుషా తనకు చేస్తున్న సహాయానికి ఋణం ఎలా తీర్చుకోవాలో జగతసింహుడికి తెలియలేదు. "స్వామీ, నేను



అయుషాను ఒక్కసారి చూసే ఉపాయం ఏమీ లేదా ?" అని అత నడిగాడు.

"ఉపాయం ఉన్నప్పటికీ ఆమె నిన్ను చూడదు. చూసుకోవటం వల్ల మీ ఇద్దరికీ బాధేనని ఆమె నమ్మకం. అందుచేత ఆమె నీ కోసం ప్రాణాలన్నా అర్పిస్తుంది గాని, నిన్ను చూడదు. మిగిలిన విషయాల మాట తరవాత చూడవచ్చు, ముందీ కాగితం పైన సంతకం చెయ్యి," అన్నాడు అభిరామస్వామి.

జగతసింహుడు సంతకం చేసిన కాగితాన్ని అయన నలగ కుండా, భద్రంగా జేబులో పెట్టుకుంటూండగా కారాగార రక్ష



కుడు ఆయనను తొందర చేశాడు. అభిరామ స్వామి వెళ్ళిపోయాడు...

మానసింహుడు చాలా దర్పంగా తన కొడుకుకు యావజ్జీవ కారాగారశిక్ష విధించి అందరికీ ఆశ్చర్యవిభ్రమం కలిగించాడు, అక్బరు పాదుషాను మెప్పించాడు, న్యాయ బుద్ధి కలవాడనిపించు కున్నాడు; కాని ఆయన మనస్సు అస్థిమితంగానే ఉన్నది. అందుకు కారణా లున్నాయి: జగతసిం హుడు ఆయనకు ఒక్కడే కొడుకు; అదీ గాక అతను చేసిన రాజకీయ నేరా లన్నిటికీ ఏదో కారణం ఉండి ఉండవచ్చు, కాని అతను తన ప్రవర్తనకు గల కారణాలను చెప్పుకునేటందుకు మానసింహుడు అవ కాశం ఇవ్వలేదు. మానసింహుడు జరిపినది విచారణే కాదు. మానసింహుడి దృష్టిలో జగతసింహుడు చేసిన నిజమైన నేరం దుర్గేశనందిని అయిన తిలోత్తమను పెళ్ళా డటం; ఆ నేరాన్ని మాత్రమే మానసిం హుడు క్షమించలేడు.

ఒకనా డాయన ఊర్మిళ అంతఃపురానికి వెళ్ళినప్పుడు ఊర్మిళాదేవి రాజలక్ష్మిని గురించి తనకు బెంగగా ఉన్నట్టు చెప్పింది; ఆ పిల్ల తన కడుపున పుట్టిన కూతురు లాగా మసలుతున్న దన్నది.







"అలా అయితే ఆమెను నీ వెంటనే ఉంచుకో. ఆమె తల్లిదండ్రులకు అలాగని కబురుచేస్తాను," అన్నాడు మానసింహుడు.

"ఆమెను మన వద్ద ఉంచుకోగానే సరా? ఆమె కష్టసుఖాలు ఆలోచించవద్దా?" అన్నది ఊర్మిళ.

"ఏమి టామెకు వచ్చిన కష్టం?"

"ఆమెకు అందం ఉన్నది, గుణం ఉన్నది; కాని అభాగ్యురాలు. ఆమెను భర్త ఎంతో ఇష్టంగా పెళ్ళాడాడు. కాని ఇప్పు డామెకు కులం తక్కువనీ, అందుచేత ఏలుకోననీ అంటున్నాడు."

"ఆమె వంశంలో దోషమేమైనా ఉన్నదా?"

"పెద్ద దోష మేమీ లేదు. ఏమైనా ఉంటే మాత్రం, పాపం, దాని కామె ఏంచెయ్య గలదు? వంశంలో దోషం ఉందని పిల్ల గుణం కూడా పాటించకుండా వదిలేస్తారా?"

"అంత మంచి పిల్లను వదిలెయ్యటం తప్పే. ఆమె భర్త ఏం చేస్తుంటాడు?"

"మీ కింద సైనికుడుగా ఉంటున్నాడు. మీరు అనుగ్రహిస్తే ఈ పిల్ల కష్టా లీడేరుతాయి."

"నా కింది సైనికుడే అయితే అది నా చేతిలో ఉన్న పనే. అతని దగ్గిర బంధువులను పిలిపించి, అందరి ఎదటా అతన్ని ఒప్పించి, అతను రాజలక్ష్మి నేలుకునేటట్టు చేస్తాను, నీవు విచారించకు. కాని ఆ తర వాత మనకేం ఒరుగుతుంది? భర్త వచ్చి ఆమెను తీసుకుపోతాడు. ఆమె నీ దగ్గర ఉండకుండా వెళ్ళిపోతుంది."

"ఆ భయం ఉండదులెండి. అతనూ మన దగ్గిరే ఉంటాడు, ఈమె కూడా మన వెంటే ఉంటుంది. ఆమె ముఖం ఆనం దంతో విప్పారితే నేను కూడా సుఖపడి పోతాను. మీరు మాత్రం తప్పక నాకీ సంతోషం సమకూర్చిపెట్టాలి," అంటూ ఊర్మిళ కంట తడిపెట్టుకున్నది.





మానసింహుడామె చెయ్యి పట్టుకుని, "నేను తప్పక నీ కోరిక తీర్చుతాను. అందుకే ఆక్షేపణా చెప్పను. అందువల్ల నాకు నలుగురిలో తలవంపులూ, అపఖ్యాతీ వచ్చిపడినా సరే నేను వెనకాడను. సరా?" అన్నాడు.

"మహారాజా, అయితే తిలోత్తమను మీ కోడలుగా ఏలుకోండి. అన్నమాట నిలబెట్టుకోండి," అన్నది ఊర్మిళ.

"తిలోత్తమనా? ఇప్పుడు తిలోత్తమ ప్రసక్తి ఏం వచ్చింది?"

రాజలక్ష్మి వచ్చి మహారాజు పాదాల పైన పడి ఏడవసాగింది.



"అవును మహారాజా, రాజలక్ష్మి మీ కోడలు తిలోత్తమ," అన్నది ఊర్మిళ.

మానసింహుడు తలవంచుకుని కొంత సేపు ఆలోచించి, చివరకు, "నీ కోరిక నిరాకరించను. అన్నమాట నిలబెట్టుకుంటాను. తిలోత్తమ నాకు కోడలు కావటానికి అన్ని విధాలా యోగ్యురాలు, అందు కెలాటి సందేహమూ లేదు. ఇక నుంచి ఆమెకు రాణివాసపు మర్యాదలన్నీ జరిపిస్తాను," అన్నాడు.

"ఇందుకు నేను మీకు యావజ్జీవం కృతజ్ఞురాలిని," అన్నది తిలోత్తమ.

నవాబునందిని ఆయుషా పాట్నానగరానికి వచ్చిందనీ, ఒక ధనికుడైన పఠాను ఇంట అతిథిగా ఉంటున్నదనీ మానసింహుడికి గూఢచారుల ద్వారా తెలిసింది. పఠానులకూ మొగలులకూ సంబంధాలున్నాయి, వారు స్వేచ్ఛగా వస్తూ పోతూ ఉంటారు. ఆయుషా బహిరంగంగా పాట్నాకు వచ్చి ఉండినట్టయితే, కతలూఖాన్ కుమార్తెకు చేయవలిసిన స్వాగత మర్యాదలు మానసింహుడు జరిపి ఉండేవాడు. ఆమె రహస్యంగా రావటం చేత ఆయనకు ఆ అవసరం లేకుండాపోయింది. అయితే బెంగాలులో ఉన్న పఠానులందరూ సంతో

షంగా మొగలాయీ ప్రభుత్వం కింద ఉన్నవారు కారు. ఒరిస్సాలోని పఠానులు చూడబోతే తమ ఆధిపత్యం కోసం యుద్ధ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అలాటి పరిస్థితిలో ఆయుషా రహస్యంగా ఒరిస్సా నుంచి వచ్చి, పాట్నాలోని ఒక పఠాను ధనికు డింట అతిథిగా వుండటం అనుమానాస్పదం. అయినా మానసింహుడు ఈ విషయం అంతగా పట్టించుకోలేదు.

కాని ఒక వారం తరవాత ఒక దుర్వార్త తెలిసింది. ఒరిస్సా నవాబులైన సులేమాన్ ఖాన్, ఉస్మాన్‌ఖాన్‌లు పూరీ నగరం పైన వచ్చిపడ్డారట, రామచంద్రదేవుడు పారిపోయాడట. మానసింహుడు వెళ్ళిపోయిన కొద్దిరోజులకే ఉస్మాన్‌ఖాన్ ఈ పని చేసి, పఠానులకూ మొగలులకూ మధ్య జరిగిన సంధిని భగ్నం చేశాడు.

ఈ వార్త వినగానే మానసింహుడికి దారుణమైన ఆగ్రహం కలిగింది. పఠానులనే వాళ్ళు ప్రపంచంలో లేకుండా చెయ్యాలని తీర్మానించుకుని ఆయన, యుద్ధానికి సిద్ధం కావలిసిందని తన సేనలకూ. సేనాపతులకూ హెచ్చరిక చేశాడు. మానసింహుడు ఉస్మాన్‌ఖాన్‌ను మానసిక వ్యధకు గురి చెయ్యగల స్థితిలో ఉన్నాడు—



ఆయుషాను నిర్బంధంలో ఉంచినట్టయితే ఉస్మాన్ ప్రాణం గిలగిలా తన్నుకుంటుంది. అందుచేత ఆయన తాజ్‌ఖాన్ అనే వాడి ఇంటిని చుట్టుముట్టమని కొందరు సైనికులను పంపాడు.

ఈ తాజ్‌ఖాన్ అనే పఠాను ఇంటనే ఆయుషా దిగింది. తాజ్‌ఖాన్ కాశ్మీరుబేగమ్‌కు దూరపు బంధువు. తాజ్‌ఖాన్ భార్య అనేక పర్యాయాలు కతలూఖాన్ రాజభవనానికి వెళ్ళివచ్చింది. ఆయుషాను ఒక్కసారి తమ ఇంటికి రమ్మని ఆమె కోరిఉన్నది కూడా. ఇంత కాలానికి తలవని తలంపుగా ఆయుషా తాను వస్తున్నట్టుగా ఉత్తరం రాసి, ఆ ప్రకా

రమే పాట్నాకు వచ్చి, వారి ఇంట బస చేసి ఉన్నది. తాజ్‌ఖాన్, ఆయన భార్యా ఆమె కెంతో గౌరవ మర్యాదలతో ఆతిథ్యం నెరపుతున్నారు.

ఒక నాటి సాయంకాలం రాజభటులు వచ్చి తన ఇంటిని ముట్టడించే సరికి తాజ్‌ఖాన్ ఆశ్చర్యపడి, ముట్టడికి కారణమడిగాడు. కాని సైనికులు కారణం చెప్పలేకపోయారు.

మర్నాడు తెల్లవారు తూనే తాజ్‌ఖాన్ మానసింహుడి వద్దకు వెళ్ళాడు. ఆయన తన ఇంటిని భటులు చుట్టు ముట్టారని అంటే మానసింహుడు, "మీ ఇంట కతలూఖాన్ కుమార్తె ఉన్నది. ఆమెను పట్టుకోవటానికి భటులు వెళ్ళారు. ఆమెను వారికి అప్పగించినట్టయితే ముట్టడి ఎత్తేస్తారు," అన్నాడు. తాజ్‌ఖాన్‌కి మాట బొత్తిగా అర్థం లేని మాటగా కనబడింది.

"మహారాజా, నేను వర్తకం చేసుకునే వాణ్ణి. మా ఇంటికి ఎందరో వచ్చిపోతూంటారు. ఈ రాకపోకలకు అవాంతరం కలిగే పక్షంలో నాకూ, నా వ్యాపారానికీ తీరని నష్టం కలుగుతుంది," అన్నాడు తాజ్‌ఖాన్.

"ఈ మాటలన్నీ అప్రస్తుతం. ఆయపాను రాజభటుల వెంట వచ్చేటందుకు ఒప్పించే భారం మీది. ఆమె కెటువంటి అమర్యాదా జరగదు. ఆమె మా అంతఃపురంలోనే ఉంటుంది," అన్నాడు మానసింహుడు.

"నా శరీరంలో ప్రాణం ఉండగా నా అతిథిని ఒప్పగించను," అని ప్రకటించి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు తాజ్‌ఖాన్.

ఈ సంగతి ఆయపాకు తెలిసింది. ఆమె తాజ్‌ఖాన్‌తో తనకు మానసింహ మహారాజును చూడాలని ఉన్నట్టు చెప్పింది. దానికి తగిన ఏర్పాట్లు జరిగిన మీదట ఆమె తాజ్‌ఖాన్‌నూ, ఇద్దరు పరిచారకులనూ వెంటబెట్టుకుని మానసింహ మహారాజు వద్దకు వెళ్ళింది. —(ఇంకావుంది)






# వరప్రసాదం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవే అద్భుత ప్రభావాన్ని సంపాదించ గోరి ఈ నిశి రాత్రి వేళ ఇంతగా శ్రమపడుతున్నావో గాని, ఆ ప్రభావం చేతికి అందాక దాన్ని కాస్తా ఉత్పలుడి లాగా విడిచి పుచ్చకు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఉత్పలుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

నర్మదా తీరాన అరణ్య ప్రాంతంలో ఉత్పలుడూ వాడి తల్లీ నివసించేవారు. ఉత్పలుడు అరణ్యంలోకి వెళ్ళి కాయలూ, పళ్ళూ, దుంపలూ, తేనే మొదలైనవి తెచ్చేవాడు. వాటితో తల్లికొడుకులు పొట్ట నించుకుని పేద జీవితం గడుపుతూ ఉండేవారు. ఉత్పలుడికి స్నేహితు లెవరూ లేరు.

## బేతాళ కథలు



అందుచేత వాడొక కుక్కనూ, ఒక పిల్లినీ చేరదీసి, అస్తమానమూ వాటిని వెంట వేసుకుని తిరుగుతూ ఉండేవాడు. "మనకే తిండికి జరగకుండా ఉంటే ఈ జంతువులు కూడా ఏమిటిరా?" అని తల్లి వాణ్ణి కోప్పడేది. కాని వాటి వల్ల తల్లికొడుకులకు నిజానికి లాభమే కలుగుతుండేది. కుక్క కుందేళ్ళనూ, పొదలలో ఉండే పక్షులనూ వేటాడి తెచ్చేది. వాళ్ళు తమ ఇంటో నిలవ ఉంచుకునే దుంపలు మొదలైన ఆహార పధార్థాలు ఎలుకల పాలు కాకుండా పిల్లి కాపాడేది. తన కున్న స్నేహితు లా రెండే గనక ఉత్పలుడు అస్తమానమూ వాటితో మాట్లాడేవాడు. అవి జవాబు చెప్పలేక పోయినా వాడు చెప్పేది అర్థం చేసుకునేవి.

ఒకనాడు ఉత్పలుడు అరణ్యంలో దూరంగా ఉన్న ఒక గ్రామం కేసి వెళ్ళాడు. అక్కడ గ్రామస్థులు కొంత అడవి కొట్టేసి పంటలకు అనుకూలంగా ఒక మైదానం తయారు చేశారు. ఆ మైదానం నిండా చాలా ఎత్తున గడ్డి పెరిగింది. గ్రామస్థులా గడ్డిని కోస్తున్నారు. కొంత మేర గడ్డిని వది లేసి దాని చుట్టూ శుభ్రం చేస్తూండటం చూసి ఉత్పలుడు, "ఆ మేర గడ్డి కొయ్యరేం?" అని అడిగాడు.

"అందులోకి పాము దూరింది. దగ్గిరికి పోతే ఏం చేస్తుందోనని భయంగా ఉంది," అన్నారు గ్రామస్థులు.

ఉత్పలుడికి ఏ జంతువు భయమూ లేదు. వాడు అరణ్యంలో అన్ని రకాల జంతువులనూ రోజూ చూస్తూనే ఉంటాడు. వాటి పట్ల వాడికి స్నేహభావమే తప్ప భయం గాని, కోపం గాని లేదు. అందుచేత వాడు దట్టంగా ఉన్న గడ్డి దుబ్బును సమీపించి, "పామూ, పామూ, బయటికిరా. మా ఇంటికి తీసుకుపోతాను," అన్నాడు. మరుక్షణమే ఒక అందమైన పాము గడ్డి దుబ్బుల మధ్య నుంచి వాడి వద్దకు

వచ్చింది. ఉత్పలుడు దాన్ని తన మెడకు చుట్టేసుకుని ఇంటికి తీసుకుపోయాడు.

"కుక్కలూ పిల్లులూ చాలక పాములను కూడా ఇంటికి చేరుస్తున్నావుట్రా?" అన్నదితల్లి.

"మంచిపాములే. దానికి నే నంటే ఎంతో ఇష్టం," అన్నాడు ఉత్పలుడు.

రోజులు గడుస్తున్న కొద్దీ పాములో ఉత్సాహం మందగించటం గమనించి ఉత్పలుడు, "అంతకంతకూ మన్నుతిన్న పాములా అయిపోతున్నా వేమిటి? ఏమిటి నీకు పట్టుకున్న బెంగ?" అన్నాడు. కుక్కతోనూ, పిల్లితోనూ మాట్లాడినట్టే పాముతో కూడా వాడు మాట్లాడాడే గాని, అది మనిషి భాషలో తనకు జవాబు చెబుతుందని వాడనుకోలేదు

"నే నొక నాగరాజు కొడుకును. మా తండ్రి తలలో మణి గల గొప్ప నాగుడు. ఆ కారణం చేత నాగులకురాజు. మా తండ్రి తల మీద ఉండే మణి తీర్చలేని కోరి కంటూ లేదు. అలాటి మణి ప్రపంచంలో మరే పాముకూ లేదు. నే నొకనాడు సాటి నాగ యువకులతో ఆడు కుంటూండగా గరుత్మంతుడు మమ్మల్ని చూసి రివ్వున బాణం లాగా దిగి వచ్చాడు. నేను తప్ప



మిగిలిన నాగు లందరూ గరుత్మంతుడికి అందకుండా తప్పించుకున్నారు. నన్ను గరుత్మంతుడు కాళ్ళతో తన్నుకుని ఎగురుతూ ఇటుగా వచ్చాడు. గరుత్మంతుడు ఏమరుపాటుగా ఉన్న సమయంలో నేను అతని కాలిగోళ్ళ నుంచి జారి గడ్డిదుబ్బుల్లో పడ్డాను. మా ఇంటికి పోవాలని ఉన్నది, కాని ఒంటరిగా పోలేను. దారి చాలా భయంకరమైనదీ, అపాయకర మైనదీనూ," అన్నది పాము.

"ఈ సంగతి ఇన్నాళ్ళూ చెప్పావు కావేం? దిగులుపడకు. నిన్ను నేను ఎలాగైనా మీ ఇంటికి చేరుస్తాను," అని ఉత్ప



లుడు నాగ యువరాజును మెడలో వేసుకుని బయలుదేరాడు. సూటిగా ఉత్తరంగా వెళ్ళమని పాము అన్నది.

ఉత్పలుడు చాలా రోజులు ప్రయాణం చేశాడు. కొంత దూరం వెళ్ళాక దారి మహా భయంకరంగా తయారయింది. దారికి ఊబీ, ముళ్ళడొంకలూ అడ్డొచ్చాయి. తిండి లేదు. అత నెన్నడూ కనీ వినీ ఎరగని కీటకాలు అతని పైన మూగి, రక్తం పీల్చాయి. అన్ని కష్టాలూ సహిస్తూ ఉత్పలుడు నాగరాజుండే ప్రదేశానికి చేరుకున్నాడు. అక్కడ అతి భయంకరమైన పాము లెన్నో అతనికి కనిపించాయి. కానీ అవేవీ అతని జోలికి రాలేదు. అతని మెడలో ఉన్న పాము వాటితో ఏదో మాట్లాడింది.

ఒక విశాలమైన ఊబిమైదానం మధ్య నాగరా జుండే భవనం ఉన్నది. అది ఎంతో అందంగా, ఎండలో ధగధగలాడుతున్నది. ఉత్పలుడు నాగరాజునూ, అయన నెత్తిన ఉండే మణినీ చూశాడు. అది సూర్యుడి లాగా కాంతులు వెదజల్లుతున్నది.

తన కొడుకు తిరిగి దొరికినందుకు పరమానందం పొంది నాగరాజు ఉత్పలుణ్ణి, ఏం కావాలో కోరుకోమన్నాడు.

"మీ శిరోమణి నివ్వండి," అన్నాడు ఉత్పలుడు. వాడు అప్పటి దాకా జీవితంలో అసంతృప్తి అన్నది ఏనాడూ పొందనప్పటికీ ఆ మణితో తీరని కోరిక అంటూ ఉండదని తెలిసినాక, దాని సహాయంతో తీర్చుకోదగిన కోరిక లెన్నో వాడిలో పుట్టుకొచ్చాయి.

నాగరాజు కొంచెం ఆలోచించి, "నా మణిని అలాగే ఇస్తాను, కాని ఏ నాడు నీ కిది ఉపయోగపడదని తోస్తే ఆ నాడు నాకు దీన్ని తిరిగి ఇచ్చేస్తానని మాట ఇయ్యి," అన్నాడు.

ఉత్పలుడు సరేనని నాగరాజు వద్ద మణి పుచ్చుకుని, తాను మరుక్షణంలోనే ఇంటి వద్ద ఉండాలని కోరుకున్నాడు. వాడి

కోరిక సిద్ధించింది. మణి ప్రభావంచేత తిన టానికి మంచి రుచికరమైన ఆహారమూ, కట్టటానికి వెలలేని బట్టలూ—సమస్తమూ అమరాయి. ఇప్పుడు వాడు రోజూ అరణ్యం లోకి పోయి అవీ, ఇవీ తేనవసరం లేదు.

అయినా ఉత్పలుడికి ఏదో అసంతృప్తి పట్టుకున్నది. వాడి కిప్పుడు అరణ్య జీవిత మంటే రోత పుట్టింది. ప్రపంచంలో గొప్ప నగరా లున్నాయి, రాజభవనా లున్నాయి, ఎంతో నాగరికత ఉన్నది. తన చేతిలో మణి ఉండగా, తాను ఆటవికుడల్లే ఎందుకు జీవించా లనిపించింది. అందు చేత వాడు దివ్యమైన వస్త్రాభరణాలు ధరించి మేలుజాతి గుర్రాన్ని ఎక్కి, మణిని వెంటబెట్టుకుని బయలుదేరాడు.

వాడు తిన్నగా తమ దేశాన్ని ఏలే రాజు గారి ఇంటికి వెళ్ళాడు. వాడి అట్టహాసం చూసి రాజు వాడికి బ్రహ్మాండమైన స్వాగతం యిచ్చాడు. అయితే రాజుగారి కూతురూ, కొలువులో ఉండే ఉద్యోగులూ కూడా కొద్ది క్షణాలలోనే, ఉత్పలుడు సంస్కార హీనుడైన ఆటవికు డని కనిపెట్టేశారు.

ఉత్పలుడు కొద్ది రోజులపాటు రాజుగారికి అతిథిగా ఉన్న మీదట ఒకనాడు రాజుతో, "మీ కుమార్తెను పెళ్ళాడదా మనుకుంటున్నాను," అన్నాడు.





ఈ మాటకు రాజు నిర్ఘాంతపోయాడు. వాడి ధైర్యానికి ఏ మనాలో ఆయనకు తోచలేదు. ఇన్నాళ్ళుగా తన అతిథిగా ఉన్న వాడితో కుండ పగలేసినట్టు మాట్లాడటం బాగుండ దనిపించి ఆయన, "ఇక్కడికి మూడుమైళ్ళ దూరాన ఒక కొండ ఉన్నది, తెలుసుగదా ? దాని చుట్టూ ముప్ఫైవేల ఎకరాల ఊబి ఉన్నది. ఆ కొండను సగం వరకూ భూమిలోకి దించి, దాని పైన ఒక చలవరాతి కోట కట్టి, చుట్టూ ఉండే ఊబి భూమిని పంట భూమిగా చేసినట్టయితే నువు కోరినట్టు మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

"నువు మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవా లంటే వెయ్యి జన్మలు తల్లకిందుగా తపస్సు చెయ్యాలి సుమా," అని అర్థం వచ్చేటట్టు చెప్పా ననుకున్నాడు రాజు. కాని ఉత్పలుడు అలా అర్థం చేసుకోలేదు—రాజకుమార్తెను తాను పెళ్ళాడటానికి అది షరతుగా భావించి, "అలాగే చేస్తాను. అదెంత పని?" అన్నాడు. సభలో అందరూ చాటుగా నవ్వుకున్నారు.

కాని మర్నాడు ఉత్పలుడు రాజసభలో, "మీరు చెప్పినదంతా చేసేశాను. మీ అమ్మాయికీ నాకూ పెళ్ళి ఏర్పాటు చేయించండి," అన్నాడు.

రాజూ, ఆయన సభలోనివాళ్ళూ తెల్లబోయారు. అందరూ కలిసి బయలుదేరి వెళ్ళారు. కొండ ఎత్తు సగ మయింది, దాని పైన అందమైన పాలరాతి కోట ఉన్నది. కొండ చుట్టూ ఊబికి బదులు, ఏపుగా ఎదిగిన పైరుతో సహా సుక్షేత్రమైన పొలాలున్నాయి.

రాజుకు అన్నమాట నిలబెట్టుకోక తప్ప లేదు. రాజకుమార్తె కూడా ఉత్పలుణ్ణి పెళ్ళాడటానికి సమ్మతించింది. ఇద్దరికీ పెళ్ళి జరిగిపోయింది. కాని ఉత్పలుడికి అనుకున్న సుఖం దక్కలేదు. అతన్ని

రాజకుమార్తె, "నువు అటవికుడివి. అనాగరికుడివి. నీ కెలాటి పాండిత్యమూ లేదు," అని దెప్పిపొడవసాగింది.

"వాటన్నిటితోనూ ఏం పని? నా దగ్గిర ఏది కావాలంటే అది సాధించే శక్తి ఉన్నది. అందుచేత, నా భార్యవైన నీ కే లోటూ రాదు," అన్నాడు ఉత్పలుడు.

"ఈ శక్తి నీ కెలా వచ్చింది? అది మంచిశక్తో, చెడ్డశక్తో నా కెలా తెలుస్తుంది?" అన్నది రాజకుమార్తె.

ఉత్పలు డామెకు తన వద్ద ఉన్న మణిని చూపించి, దాని ప్రభావం తెలిపాడు. ఆమె అది చూసి చాలా సంతోషించినట్టు నటించింది. ఆ మణి సంపాదించి నందుకు అతన్ని ఎంతో మెచ్చుకుని, ఆ రాత్రి అతనికి ఆమె స్వయంగా వడ్డనచేసి, భోజనంలో మత్తుమందు పెట్టేసింది. భోజనం చేస్తూనే ఉత్పలుడు ఒళ్ళుతెలియని మత్తులో పడి పోయాడు. రాజకుమార్తె అతని దగ్గిర ఉండే మణిని సంగ్రహించి, "ఈ పీడాకారపు మొగుడు వదిలిపోవాలి. అతను దీని ప్రభావంతో సంపాదించిన దంతా పోవాలి," అని కోరుకున్నది.

మర్నాడు ఉత్పలుడికి స్పృహ తెలిసే సరికి వాడు అరణ్యప్రాంతంలో తన సొంత



గుడిసెలో ఉన్నాడు. ఆ గుడిసెలో కుక్కా, పిల్లీ మాత్రమే ఉన్నాయి. అతని తల్లి కొద్ది రోజుల క్రితం చనిపోయింది. అతనికి మొదట తన పరిస్థితి ఏమీ అర్థం కాలేదు. చాలాసేపు ఆలోచించిన మీదట రాజకుమార్తె తనను మోసం చేసిందనీ, తన మణిని కాజేసిందనీ అతను తెలుసుకున్నాడు. తన కష్టాలు చెప్పుకునేటందుకు పిల్లీ, కుక్కా తప్ప అతని కింకెవరూ లేరు, అందుచేత వాటితోనే అంతా చెప్పుకున్నాడు.

ఆ రాత్రే పిల్లీ, కుక్కా బయలుదేరి రాజభవనానికి వెళ్ళాయి. భవనం చుట్టూ కోట ఉన్నది. కోట చుట్టూ అగడ్త ఉన్నది.



అగడ్త మీద వంతెన ఉన్నది గాని, దాని మీదికి వెళ్ళేసరికి కాపలావాడు కుక్కనూ, పిల్లినీ తరిమేశాడు.

రెండూ అగడ్త వెనక భాగానికి వెళ్ళాయి. కుక్క పిల్లిని తన వీపు మీద కూర్చోబెట్టుకుని అగడ్త ఈదింది. రెండూ కోటలోపలికి చేరాక పిల్లి రాజభవనం ప్రవేశించి, గదులన్నీ తిరిగి రాజకుమార్తె పడుకుని ఉన్న గది చేరుకున్నది. మణిని తన చేతిలోనే పెట్టుకుని రాజకుమార్తె నిద్రపోతున్నది. పిల్లి బయటికి వెళ్ళి ఒక ఎలుకను పట్టుకుని తెచ్చి రాజకుమార్తె మీద వేసింది. ఎలుక కిచకిచ లాడుతూ మీదిగా పరిగెత్తే



సరికి రాజకుమార్తె గాభరాపడి లేచింది. ఆమె చేతిలో ఉన్న మణి కాస్తా కింద పడింది. పిల్లి దాన్ని నోట కరుచుకుని మెరుపు లాగా మాయమయింది.

కుక్కా, పిల్లీ వెనకటి లాగే అగడ్త ఈది, తెల్లవారే సరికి ఇంటికి చేరుకుని మణిని తమ యజమాని కందించాయి.

"ప్రపంచంలో మీ ఇద్దరే నా కున్న నిజమైన ఆప్తులు," అని ఉత్పలుడు వాటిని మనస్ఫూర్తిగా కౌగలించుకున్నాడు. తరవాత అతను రాజుగారి వద్దకు వెళ్ళి, రాజకుమార్తె తనకు చేసిన మోసం చెప్పాడు.

"అది నీ భార్య. నీ ఇష్టం వచ్చినట్టు శిక్షించు," అన్నా డాయన.

"ఆమె మనస్ఫూర్తిగా నాకు భార్య కాలేదు. మాది పెళ్ళే కాదు. ఆమెకు నచ్చిన నాగరికుణ్ణి చూసి పెళ్ళి చేసెయ్యండి. ఆ మాట చెప్పడానికే వచ్చాను," అన్నాడు ఉత్పలుడు.

అతను మణి సహాయంతో తన కుక్కనూ, పిల్లినీ వెంటబెట్టుకుని నాగరాజుండే చోటు చేరుకున్నాడు. అతను నాగరాజుకు మణిని తిరిగి ఇచ్చేసి, "నా కింక ఈ మణితో పనిలేదు. నా స్నేహితులైన ఈ కుక్కనూ, పిల్లినీ వెంటపెట్టుకుని



ఎక్కడైనా సంచారం వెళ్ళాలన్న కోరిక తప్ప నా కింకే కోరికా లేదు," అన్నాడు.

"అలా అయితే, మీరు ముగ్గురూ మా దగ్గిరే ఉండిపోండి. మా వాడు కూడా అస్తమానమూ నిన్ను గురించే తలచు కుంటున్నాడు," అన్నాడు నాగరాజు.

ఆయన మాట తీసెయ్యక ఉత్పలుడు తన కుక్కతోనూ, పిల్లితోనూ నాగరాజ్యం లోనే ఉండిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. ఉత్పలుడు తన చేతికి తిరిగి వచ్చిన మణిని ఆధారం చేసుకుని అంతు లేని సుఖాలు అనుభవించటానికి బదులుగా, ఆ మణిని తీసుకుపోయి నాగరాజుకు తిరిగి ఎందు కిచ్చేశాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగులు తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆ మణి ఎన్ని కోరికలను సిద్ధింపజేసినా ఉత్పలుడి సుఖాన్నీ, సంతోషాన్నీ పెంచలేదు. అతని కోరికలనూ, అసంతృప్తినీ మాత్రమే పెంచింది. కోరికలు పెరిగిపోవటం చేతనే అతను తనకు నిజమైన ఆప్తులైన తల్లినీ, కుక్కనూ, పిల్లినీ వదిలేసి దూరంగా వెళ్ళి పోయాడు. తల్లి చనిపోయే సమయంలో అయినా దగ్గిరలేడు. అంతేగాక ఆ మణి మానవస్వభావాన్ని మార్చలేదు. ఎంత సంపద ఉన్నా అతని ఆటవిక మన స్తత్వమూ, అనాగరికతా మారలేదు. అదే విధంగా ఆ మణి రాజకుమార్తెను అతనికి భార్యగా చేసిందేగాని, ఆమె మనసునూ, హృదయాన్నీ అతని కేసి మళ్ళించలేక పోయింది. ఈ విషయాలన్నీ గ్రహించే ఉత్పలుడు ఆ మణిని నాగరాజుకు తిరిగి ఇచ్చేశాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# యముడి మరణం

ఆదికాలంలో దేవతల సంతానమైన మానవులు, భూమి యొక్క ఉత్తర ధ్రువప్రాంతంలో ఉంటూ, దేవతలతో సన్నిహితంగా జీవించేవారు. ఆ ప్రాంతాన ఎప్పుడూ సూర్యుడు ప్రకాశించేవాడు కాబట్టి, అక్కడ కాలమానం ఉండేది కాదు. అక్కడి మానవులలో ఆదిదంపతులు యముడూ, అతని భార్య యమీ. యముడు సూర్యుడి కొడుకే.

కొంతకాలం గడిచాక యముడు చనిపోయాడు. మానవులలో అదే తొలి చావు కావటం చేత మిగిలిన మానవులు దాన్ని అర్థం చేసుకోలేక పోయారు.

అప్పుడు దేవతలు వచ్చి, అమృతం తాగని మానవులందరూ కొంత కాలానికి యముడు లాగే అయిపోతారనీ, అది మానవులకు మరణదశ అనీ, మరణం పొందిన అనంతరం మానవశరీరాలను పంచభూతాలలో చేర్చవలసి ఉంటుందనీ తెలిపారు.

మానవులలో మొట్టమొదటగా చనిపోయినవాడు యముడే కాబట్టి, బ్రహ్మ, ఇంద్రుడూ మొదలుగా గల దేవతలు అతనికి గౌరవం చేయదలచి, పితృలోకానికి అధిపతిగా చేశారు.

ఈలోపల భూమి మీద యమి తన భర్త కోసం అదేపనిగా ఏడవసాగింది. ఆ ప్రాంతంలో కాలమానం లేకపోవటం చేతా, యముడు పోయాక జరిగిన సంఘటన లేవీ ఆమెకు తెలియక పోవటంచేతా యమి తన భర్త మరణాన్ని ఏమాత్రమూ మరిచిపోలేక పోయింది.

"మానవులకు మరణం తప్పదనీ, చచ్చిపోయినవారు తిరిగి బతకరనీ దేవతలు చెప్పనే చెప్పారు గద! యముడు పోయాక ఇంకెందరో మానవులు పోయారు. అందుచేత నువు ఇక యముణ్ణి మరిచిపో," అని తోటి మానవులు యమికి చెప్పి చూశారు.

టి. హనుమంతరావు

కాని యమి వారితో, "ఎలా మరిచి పోను ? ఇప్పుడేకద యముడు పోయాడు!" అని మరింత దుఃఖించసాగింది. యమి లాగే తమ వాళ్ళను పోగొట్టుకున్న ఇతర మానవులు కూడా తమ దీర్ఘ దుఃఖాన్ని విడిచిపెట్టలేకుండా ఉన్నారు.

మానవులకు కాలమానం ఏర్పాటు చేస్తేనేగాని వాళ్ళు తమ దుఃఖం నుంచి విముక్తి పొందలేరని తెలిసి, దేవతలు సూర్యుణ్ణి ప్రార్థించి అవతలికి పంపేశారు. వెంటనే రాత్రి వచ్చి లోకాన్ని ఆవరించింది.

ఆ రాత్రి రాకతో మానవులు నిద్రపోయారు. వారి దుఃఖం ఆ నిద్రలో దూరమైపోయింది. అయితే రాత్రి ఎంత ఉండాలన్నది నిర్ణయం కాలేదు. ఆ దీర్ఘ రాత్రిలో రాక్షసులు విజృంభించి, గోవులనూ, ధాన్యాన్నీ కొల్లగొట్టసాగారు.

అందుచేత దేవతలు రాత్రీ, పగలూ కాలనిర్ణయం చేసి, సూర్యుణ్ణి పిలుచుకురావటానికి ఉషాదేవిని పంపారు. ఉషాదేవీ ఆమె వెనక సూర్యుడూ రాగానే దీర్ఘ రాత్రి అంతమయింది. అది మొదలు పగలూ, రాత్రి ఒక దాని వెనకగా ఒకటి వస్తూ కాలమానం ఏర్పాటయింది.

అప్పటికీ రాత్రివేళ రాక్షసులు విజృంభించి ఘోరాలు చేస్తూ, అడ్డం వచ్చిన వారిని హతమార్చసాగారు. అప్పుడు మానవులు ఇంద్రుణ్ణి ప్రార్థించగా, రాత్రివేళ వారికి సాయంగా ఉండటానికి అగ్నిహోత్రుణ్ణి ఏర్పాటు చేశాడు.

కాలమానం ఏర్పాటయాక యమి తన భర్త కోసం ఏడవటం మానేసింది. కాని ఆమె తన భర్తను మరిచిపోలేదు. అందుచేత యముడు ఏడాది కొకసారి, దీపావళి అమావాస్య తరవాత వచ్చే విదియనాడు, తన భార్య వద్దకు వచ్చి, ఆమె ఆతిథ్యం స్వీకరిస్తూ వచ్చాడు. ఆ రోజే మనకు యమద్వితీయ.





# ఎద్దుబేరం

ఒకసారి పాపన్న తన అత్తవారూరు వెళ్ళి, అక్కడ పొలాల మీద రావలిసిన సొమ్ము మూడు వందల రూపాయలు వసూలు చేసి ఇంటి మార్గం పట్టి రాసాగాడు. దారిలో అతని కొక హృదయ విదారకమైన దృశ్యం కంటపడింది.

దారి మధ్య ఒక లాగుడుబండి నిలబడి ఉన్నది. దానికి ఒక ఎద్దు కట్టి ఉన్నది. బండి మీద ఎత్తుగా ధాన్యపు బస్తాలు పేర్చి ఉన్నాయి. అంత బరువును ఆ ఒక్క ఎద్దు అక్కడి దాకా ఎలా లాగు కొచ్చిందో పాపన్నకు అర్థం కాలేదు. అది బాగా అలిసి నిస్త్రాణగా ఉన్నది.

నిర్జనంగా ఉన్న ఆ ప్రాంతంలో పాపన్న కనిపించగానే బండివాడు, "అయ్యా, నేను అల్లా కాలవ దాకా వెళ్ళి దాహం తీర్చుకుని వస్తాను. ఈ బండి కాస్త చూస్తూ ఉండండి," అన్నాడు.

"అలాగే వెళ్ళిరా," అని పాపన్న అక్కడే నిలబడ్డాడు.

కొంచెం సేపట్లో బండివాడు నీళ్ళు తాగి తిరిగి వచ్చి, "బతికించారు, బాబూ. ఈ కాలంలో సహాయపడే వాళ్ళు కరువయా రండీ. బండిని తొయ్యమని పావలా ఇచ్చి ఇద్దరు మనుషులను పెడితే, వాళ్ళు ఇక్కడి దాకా బండిని తోసుకొచ్చి, ఇంక తమ వల్ల కాదని వెళ్ళిపోయారండి. ఒక్కణ్ణీ ఏం చావను?" అని పాపన్నతో అని, "హై, హై," అని ఎద్దును అదిలించసాగాడు.

ఎద్దు బండిని లాగటానికి ప్రయత్నించింది గాని, బండి మటుకు కదలలేదు. బండివాడు ఎద్దును బాదసాగాడు.

పాపన్న బండివాడి చేతిలో ఉండే కర్ర లాగేసి, "నువు మాత్రం ఏమన్న మనిషివి? నువు వెళ్ళి నీళ్ళు తాగివస్తే ఎద్దు దప్పిక తీరినట్టేనా?" అంటూ ఎద్దును

కాడి నుంచి విప్పి, కాలవ కేసి తీసుకు పోబోయాడు.

బండివాడు సిగ్గుపడి, "తప్పే లెండి. మీ కెందుకు శ్రమ ? నేనే ఎద్దుకు నీరుపెట్టి తెస్తాను," అంటూ ఎద్దు తాళ్ళు తాను తీసుకున్నాడు.

"దాహంతో పాటు ఎద్దుకు ఆకలి కూడా ఉండవచ్చు. కాస్త గడ్డి కూడా మేపి మరీ తీసుకురా. నువు వచ్చిన దాకా నే నిక్కడే బండి చూస్తూ ఉంటాలే, భయం లేదు," అన్నాడు పాపన్న.

కొంత సేపటికి బండివాడు ఎద్దుతో సహా తిరిగి వచ్చి, దాన్ని బండికి కట్టి అదిలించాడు. కాని బండిని కదిలించటం ఎద్దుకు సాధ్యం కాలేదు.

అది చూసి పాపన్న, "రెండెడ్ల బండి మీద ఎక్కించేటంత సామాను ఈ లాగుడు బండి మీద వేశావు గదా, ఎద్దు ఎలా లాగుతుంది ? సగం సరుకు ఇక్కడ దించి మిగతాది చేర్చి, రెండోసారికి దించిన సరుకు తీసుకుపో. నే నిక్కడే కాపలా ఉంటాను," అన్నాడు.

"మీ రెవరో దేవుడల్లే సహాయం వచ్చారు గాని, సామానులో కొంత దించటానికి వీల్లేదు. ఇంత సామానూ ఈ ఎద్దు చేత



లాగించి తీసుకుపోవాలి. అలా నియమం జరిగింది," అన్నాడు బండివాడు.

వింతగా వుంది, అదేం నియమ మని పాపన్న అడిగితే, దాన్ని గురించి బండివాడు ఇలా చెప్పాడు :

బండివాడి పేరు ఐతన్న. వాడు సామాన్ల బండి పెట్టుకుని, దాన్ని ఎద్దు చేత లాగించి జీవనం చేస్తున్నాడు. ఎద్దును అమ్మేసి దానితో తానే సరుకు కొని, బండిని తానే లాగుతూ సరుకును చేరవేసుకోవాలని వాడికి ఆలోచన వచ్చింది. పొరుగు గ్రామంలో ఉన్న శరభాద్రిగారనే ధనికుడికి ఐతన్న తన ఎద్దును అమ్మజూపాడు. ఎంత

కిస్తా వన్నాడు శరభాద్రి. నూరు రూపాయల కిస్తా సన్నాడు ఐతన్న.

"ఛీ పోరా! ఒక్క బస్తా ధాన్యం కూడా లాగలేని ఈ బక్క ఎద్దుకు నూరురూపాయ లెవడిస్తాడు?" అన్నాడు శరభాద్రి.

"అంత తీసెయ్యకండి, బాబూ. ఇది లాగే బరువు ఏ ఎద్దూ లాగలేదు. అలా కాని పక్షంలో నా ఎద్దును ఊరికే ఇచ్చేస్తాను," అని ఐతన్న ప్రగల్భాలు పలికాడు.

"అయితే నేను కొంత సరుక్కు జాబితా ఇస్తాను. దాన్ని బస్తీలో ఫలాని షావుకారు కిచ్చి, ఆ సరు కంతా బండి మీద వేసి, నీ ఎద్దు చేత మా ఇంటికి లాగించి తీసుకురా. నువ్వడిగినట్టు నూరు రూపాయ లిచ్చి ఎద్దును కొంటాను," అన్నాడు శరభాద్రి.

బుద్ధి తక్కువై ఐతన్న అందుకు ఒప్పుకున్నాడు. జాబితా ప్రకారం సరుకు తీసుకుని బండి కెత్తి, ఎద్దును పూన్చాడు. ఎద్దు లాగలేకపోయింది. బండి రెండు మైళ్ళు పోవాలి. ఐతన్న ఇద్దరు కూలివాళ్ళను పావలా డబ్బులకు మాట్లాడి, వాళ్ళ చేత బండి తోయించు కుంటూ వచ్చాడు. ఒక మైలు వచ్చి వాళ్ళిద్దరూ, "ఇక మేం తొయ్యలేం," అని వెళ్ళిపోయారు. ఇంకో మైలు వెళితే గాని శరభాద్రిగారి ఇల్లు రాదు. సామాను ఎద్దు చేత లాగించకపోతే



శరభాద్రి ఎద్దును కొనడు సరేకదా, కూలి డబ్బులు కూడా ఇవ్వడు.

ఈ సంగతు లన్నీ వినే సరికి పాపన్నకు ఐతన్న మీద జాలి కలిగింది. "తూలి ఏదో మాట అన్నావు గదా అని ఎద్దు నిలా చంపుకు తింటావా? నీకు కావలిసింది, ఎద్దును నూరు రూపాయల కమ్మటమే గద. ఆ వంద రూపాయలూ నే నిస్తాను, నాకు ఎద్దు నిచ్చెయ్యి," అన్నా డతను ఐతన్నతో.

ఐతన్న కళ్ళు వెళ్ళబెట్టుకు చూస్తూ, నోట మాట రాకుండానే, పాపన్న ఇచ్చిన నూరు రూపాయలూ పుచ్చుకున్నాడు. పాపన్న ఎద్దును బండి నుంచి విప్పి, మేతకు వదిలిపెట్టాడు.

"ఈ సరుకు శరభాద్రిగారి ఇంటికి ఎలా చేరుస్తావు? నే నేదైనా రెండెడ్లబండి పంపుతాను. దాని మీద సామాను చేర్చి, ఎద్దు దారిలోనే మంచి వెలకు అమ్ముడయిందని శరభాద్రిగారితో చెప్పెయ్యి. ఏ చిక్కూ రాదు. ఏం?" అన్నాడు పాపన్న.

"అదంతా నేను తంటాలు పడతాలెండి. ఇవాళ నాకు తమ వంటి పుణ్యాత్ముడు దొరకటం నా అదృష్టం. మీ మేలు ఎన్నటికీ మరవను... అదుగో ఖాళీ బండి ఒకటి




ఇటే వస్తున్నది. దాని మీద సరుకు చేరుస్తాలెండి," అన్నాడు ఐతన్న.

పాపన్న ఎద్దును తోలుకుని తన దారిన తాను వెళ్ళాక, ఐతన్న ఖాళీబండిని నిలిపి, తన బండి మీద ఉన్న సరుకంతా దాని మీద ఎక్కించి, తన ఖాళీబండిని తానే ఈడ్చుకుంటూ శరభాద్రిగారి ఇంటికి చేరుకున్నాడు.

"సామాను తెచ్చావు సరే, నీ ఎద్దేదీ?" అని శరభాద్రి అడిగాడు.

"ఆ ఎద్దును చూసినవాళ్ళు ఎగరేసుకు పోరుటండీ? మీ సరుకులు వేసుకుని సగం దూరం వచ్చానో లేదో, ఒక పెద్దమనిషి

ఎదురై, 'ఎవరిదీ ఎద్దు? ఇంత సామాను సునాయాసంగా లాగేస్తున్నదే!' అన్నాడండి. తమకు నూరురూపాయులకు అమ్ముతానని ఒప్పుకున్నానని చెప్పానండి. మరో అయిదు రూపాయులు వేసి, నూటఅయిదు రూపాయలకు ఆ ఎద్దును ఆయన అపళంగానే కొనుక్కు పోయాడండి. మీ సరుకు చేరటానికి ఇంకో బండి కూడా అయనే ఏర్పాటు చేసి మరీ వెళ్ళాడండి," అన్నాడు ఐతన్న.

శరభాద్రి ఆశ్చర్యపోయి, ఎద్దును కొన్న వాడి పేరడిగాడు. అయున పేరు తనకు తెలియదనీ, ఎవరైనప్పటికీ ఎద్దు నాణెం బాగా తెలిసినవాడనీ శరభాద్రిని కాస్త ఎత్తి పొడిచి ఐతన్న సెలవు తీసుకున్నాడు. దాని విలువ తాను తెలుసుకోలేనందుకు శరభాద్రి నొచ్చుకున్నాడు.

తరవాత మూడు నెలలకు సంక్రాంతి పండగ వచ్చింది. ఎద్దుల పందాలు జరిగాయి. మూడు నెల్లపాటు పాపన్న పోషణలో ఉన్న కారణంగా అతని ఎద్దు బాగా బలిసి, పందెంలో ఆ చుట్టుపక్కల ఎద్దులన్నిటినీ ఓడించింది.

పందాలు చూడటానికి వచ్చినవారిలో శరభాద్రీ, ఐతన్నా కూడా ఉన్నారు.

ఐతన్న శరభాద్రికి పాపన్ననూ, గెలిచిన ఎద్దునూ చూపించి, "ఎద్దు తడాఖా ఇప్పుడు కళ్ళరా చూశారుగా? అడుగో ఆయనే దాన్ని కొన్నవాడు," అన్నాడు.

శరభాద్రి పాపన్నను సమీపించి, "ఈ ఎద్దును నేను కొందా మనుకుంటుండగా మీరు కొనేశారు. నేను ఎద్దుగల వాడితో ఖండితంగా కొంటానని చెప్పకపోవటం నాదే తప్పనుకోండి. ఇప్పటికైనా మీరు అమ్మే పక్షంలో కొంటాను," అన్నాడు.

"కావాలంటే తీసుకోండి. నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు పాపన్న.

శరభాద్రి ఆ ఎద్దును నూటయాభై రూపాయ లిచ్చి గర్వంగా తోలుకుపోయాడు.





# సముద్రరాణిబానిసలు

పడమటి సముద్ర తీరాన ఒక రాజుండే వాడు. ఆయనకు సముద్ర ప్రయాణాలంటే చాలా సరదా. ఆయన వద్ద ఒక గొప్ప ఓడ ఉండేది. దానికి పట్టు తెరచాప లుండేవి. ఆయన రేవు కెదురుగా తన భవనం నిర్మించుకుని, రేవులో ఓడ నుంచుకుని, కోరిక పుట్టినప్పుడల్లా అందులో ప్రయాణమై పోతూండేవాడు.

ఒకసారి ఆ ఓడ నడిసముద్రంలో అకారణంగా ఆగిపోయింది. అక్కడ సముద్రం చాలా లోతున్నది, గాలి అనుకూలంగా వీస్తున్నది, అయినా ఓడ కదలలేదు. ఏం చెయ్యటానికీ పాలుపోక, రాజు సముద్రం లోకి తొంగిచూసి, "ఓడ ఆపిన దెవరో గాని, దయ ఉంచి నా ఓడను వదిలిపెట్టి, నన్ను మా దేశానికి తిరిగి పోనిచ్చినట్టయితే నా చేతుల్లో ఉన్న పని ఏంచెయ్యమన్నా చేస్తాను," అని కేక పెట్టాడు.

ఆయన అన్న మాటకు సముద్రం అడుగు నుంచి సమాధానం వచ్చింది: "అన్న మాట తప్పకు. నీవు మీ తీరాన్ని చేరుతూనే ఏ ప్రాణిని మొట్టమొదట చూస్తావో ఆ ప్రాణిని నాకు అర్పించు. అలా చేసినట్టయితే నా సముద్రం మీదుగా నిన్ను వెళ్ళనిస్తాను."

"అలాగే చేస్తాను," అన్నాడు రాజు. వెంటనే ఓడ కదిలి ముందుకు సాగింది. సముద్రం దిగువ నుంచి మాట్లాడినది సముద్రరాణి అయి ఉంటుం దనుకున్నాడు రాజు. ఆమెను గురించి ఎన్నో విషయాలను ఆయన అదివరకే విని ఉన్నాడు.

రెండు రోజులు ప్రయాణించి ఓడ తీరానికి చేరింది. తీరం అంత దూరంలో ఉండగానే రాజుకు రేవులో ఒక కదలాడే నలుసు లాటిది కనబడింది. దగ్గిరికి వచ్చాక ఆ నలుసు పసివాడైన తన కొడుకేనని

సి. మాధవరావు



రాజు గుర్తించి, సముద్రరాణి మాట జ్ఞాపకం వచ్చి ఒక పక్కకు చూశాడు. అక్కడ నీటిలో తేలుతూ ఒక బాతు కనిపించింది. రాజు రెండో పక్కకు చూశాడు. అక్కడ ఆయన కొక పంది కనిపించింది.

ఆ బాతునూ, పందినీ సముద్రరాణికి అర్పిస్తే తన వాగ్దానం చెల్లిపోతుం దనుకుని, రాజు వాటిని చంపించి సముద్రంలో వేయించి, ఓడ దిగి తీరం చేరి తన భవనాన్ని చేరబోయాడు.

ఈ సమయంలో సముద్రం మీది నుంచి ఒక పెద్ద కెరటం రాజభవనం దాకా వచ్చింది. ఆ కెరటంతో బాటు చచ్చిన బాతూ, పందీ వచ్చి ఒడ్డున పడ్డాయి. ఆ కెరటం వెనక్కు పోయేటప్పుడు రాజకుమారుణ్ణి లాక్కుపోయి ఉండును, కాని రాజు సమయస్ఫూర్తితో తన చిన్న కొడుకును చప్పున ఎత్తుకున్నాడు.

సముద్రరాణి తన కొడుకు నిస్తే గాని తృప్తి చెందదని రాజుకు తెలిసిపోయింది. ఈ ప్రమాదం గురించి తన భార్యకూ, కుమారుడికీ చెప్పి, వాణ్ణి సముద్ర చాయలకు వెళ్ళకుండా కట్టుదిట్టం చెయ్యటం క్షేమమని రాజు అనుకున్నాడు. అటు తరవాత రాజకుమారుడు తన భవన ప్రాకారం దాటి సముద్రం కేసి వెళ్ళనేలేదు.

ఏళ్ళు గడిచాయి. రాజకుమారుడు పద్ధెనిమిదేళ్ళవా డయాడు. ఒకనా డతన్ని కొందరు మిత్రులు సముద్ర తీరానికి షికారు రమ్మన్నారు. ఇన్నేళ్ళయాక ఇంక తనకు సముద్రరాణి భయం అలాగే ఉంటుందా అన్న ధైర్యంతో అతను సరే నన్నాడు. అందరూ కలిసి సముద్ర తీరపు ఇసుక మీదికి అడుగు పెట్టారో లేదో, ఒక బ్రహ్మాండమైన కెరటం వారి పైకి వచ్చింది. అనేక ఆభరణాలు ధరించిన చెయ్యి ఒకటి పైకి వచ్చి రాజకుమారుణ్ణి పట్టుకుని నీటి లోపలికి లాక్కున్నది.



నీళ్ళలో మునిగిన రాజకుమారుడు ఉక్కిరిబిక్కిరి కాలేదు. అతన్ని ఎవరో మైదానాల మీదుగా తీసుకుపోయి ఒక మనోహరమైన ఉద్యానం చేర్చారు. ఆ ఉద్యానం మధ్య ఒక రాజభవనం ఉన్నది. అది సముద్రరాణిదై ఉంటుందని అతననుకున్నాడు. అతను ఆ భవనంలో ప్రవేశించి ఒక చావడిలోకి అడుగుపెట్టాడు. ఆ చావడి మధ్య రంగురంగుల రత్నాభరణాలు ధరించి, పాపిష్టిముఖం గల స్త్రీ ఒకతె నిలబడి ఉన్నది. ఆమె అతన్ని చూసి, "నీ కోసం చాలా ఏళ్ళుగా చూస్తున్నాను. రేపు నిన్ను పనిలో ప్రవేశపెడతాను. ఇవాళకు ఇతర కుర్రాళ్ళతోనూ, అమ్మాయిలతోనూ సరదాగా కాలక్షేపం చెయ్యి," అన్నది.

ఇలా అని ఆమె అతన్ని మరొక పెద్ద చావడికి తీసుకుపోయింది. అక్కడ అనేక మంది బాలబాలికలుండి, తమలో తాము మాట్లాడుకుంటున్నారు. వారంతా రాజకుమారులూ, రాజకుమార్తెలూనూ. వారిలో ఒక రాజకుమార్తెతో అతనికి బాగా స్నేహం కలిసింది.

"ఈ రాణి మహా చెడ్డది. ఈమె దగ్గిర నేను ఏడేళ్ళ నుంచీ బానిసగా ఉండి, ఈమె యుక్తులూ, మంత్రాలూ దాదాపు అన్నీ నేర్చుకున్నాను. అయినా ఈ రాణి నుంచి తప్పించుకోవటం చాలా కష్టం. మనిద్దరమూ స్నేహంగా ఉన్నట్టయితే జతగా పారిపోయే అవకాశం కొంచెం ఉండవచ్చు," అన్నది రాజకుమార్తె.

ఆమెతో స్నేహంగా ఉండటానికి అతనికేమీ అభ్యంతరం లేకపోయింది. తమ క్షేమం కోసం ఆమె ఏం చెయ్యమన్నా తాను చెయ్యటానికి సిద్ధంగా ఉన్నట్టు అతనామెతో చెప్పాడు.

మర్నాడు ఉదయానే సముద్రరాణి రాజకుమారుడికి కబురుచేసి, "నా బానిస



లందరిలోకీ అందమైన దాన్ని స్నేహితురాలుగా సంపాదించి నట్టున్నావు. నేను చెప్పే పనులు మూడు చెయ్యగలిగితే తప్ప నువు ఆ పిల్లను చూడటానికి కూడా అనుమతి ఇవ్వను. ఆ మూడు పనులూ చేశావో, నువ్వామెను పెళ్ళాడతానన్నా నేను అభ్యంతరం చెప్పను. అలా కాని పక్షంలో నువు యావజ్జీవమూ నాకు బానిసవై ఉండాలి," అని హెచ్చరించింది.

ఆమె అతన్ని మైదానం మీదికి తీసుకుపోయి అతను చెయ్యవలిసిన మొదటి పని చెప్పింది: సాయంకాలం లోపుగా అతను ఆ మైదానంలోని గడ్డి అంతా కత్తిరించి, మళ్ళీ ఎప్పటి లాగే అతకాలి. ఈ మాట చెప్పి రాణి వెళ్ళిపోయింది.

రాజకుమారుడు కొడవలి తీసుకుని మైదానం మీద గడ్డి కొయ్యసాగాడు. కాని సాయంకాలం లోపుగా ఆ గడ్డి అంతా కొయ్యటం తన వల్ల అయే పని కాదని అతనికి త్వరలోనే తెలిసిపోయింది—కోసిన గడ్డిని తిరిగి అతకటం మాట దేవుడెరుగు! అతను తన దౌర్భాగ్యానికి చింతిస్తూ, చేతులతో తలపట్టుకుని కూర్చున్నాడు.

కొంత సేపటికి రాజకుమార్తె అటుగా వచ్చి, అతని విచారానికి కారణ మడిగింది. రాజకుమారు డామెతో జరిగినదంతా చెప్పాడు. రాజకుమార్తె అతని చేతి నుంచి కొడవలి తీసుకుని దాన్ని ఒక పక్కకు తిప్పి గడ్డి మీద రాచింది; గడ్డి తెగిపడ సాగింది. ఆమె దాన్ని రెండోపక్కకు తిప్పి తెగిన గడ్డి మీద రాచేసరికి అది తిరిగి అతుక్కుపోయింది. అయితే కొయ్యని గడ్డికీ కోసిన గడ్డికీ చిన్న తేడా ఉన్నది. కోసి అతికించిన గడ్డికి గాటు దగ్గిర అతుకు తెలుస్తున్నది.

ఈ రహస్యం తెలిశాక రాజకుమారుడు అతివేగంగా మైదాన మంతా కోసి తిరిగి అతికించేశాడు.

సాయంకాలం కావటాని కింకా చాలా వ్యవధి ఉన్నది. స్నేహితు లిద్దరూ చాలా సేపు కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. రాణి వచ్చే వేళకు రాజకుమార్తె వెళ్ళిపోయింది. తరవాత రాణి వచ్చి చూసి, గడ్డిని పరీక్షించి, "ఇది నీ అంతట నువ్వు చేసిన పనిలాగా లేదు," అని గొణుక్కున్నది.

మర్నాడు ఉదయం రాణి రాజకుమారుడికి రెండో పని చెప్పింది: గుర్రపు సాలలో నూరు గుర్రా లున్నాయి; దాన్ని ఏ జన్మానా ఎవరూ శుభ్రం చెయ్యలేదు; సాయంకాలం లోపల రాజకుమారుడు దాన్ని బాగుచేసి, అక్కడి నేల కొత్తగచ్చు లాగా మెరిసేటట్టు చెయ్యాలి.

అతను చీపురుకట్ట ఒకటి తీసుకుని గుర్రపుసాలకు వెళ్ళాడు. అక్కడ మొలలోతున ఉన్న చెత్తా చెదారమూ చూసేసరికి అతనికి గుండె జారిపోయింది. మళ్ళీ రాజకుమార్తె అతనున్న చోటికి వచ్చి, అతని విచారానికి కారణం తెలుసుకున్నది. ఆమె గోడన వేళ్ళాడుతున్న బంగారు కంచీ ఒకటి తీసుకుని ఒక ముసలి గుర్రం ముందు ఛళ్ళు మనిపించి, "గుర్రపుసాల అంతా శుభ్రం చెయ్యి," అన్నది. వెంటనే ఆ గుర్రం తన కాళ్ళతో దుమ్మును ఆకాశం



లోకి తన్న నారంభించింది. రాజకుమారుడూ, రాజకుమార్తే అక్కడి నుంచి దూరంగా పారిపోయారు.

వాళ్ళు కొంత సేపుండి తిరిగి వచ్చి చూసేసరికి గుర్రపుసాలలో ఒక్క నలుసు మట్టి కూడా లేదు. రాజకుమార్తె ఒక గుడ్డ తెచ్చి అక్కడి నేలను తుడిచే సరికి అది కొత్త గచ్చు లాగా తళతళ లాడింది.

సాయంకాలం కాగానే రాణి వచ్చి, "ఇది నువు నీ అంతట చేసిన పని కాదు," అని గొణుక్కున్నది.

మూడోనాటి ఉదయం రాణి రాజకుమారుడికి మూడో పని చెప్పింది: వెయ్యి

పందులుండే పందుల కొట్టాన్ని ఏ జన్మానా ఎవరూ బాగుచెయ్యలేదు; సాయంకాలం లోపుగా దాన్ని రాజకుమారుడు బాగుచేసి కొత్తకొట్టం లాగా చెయ్యాలి.

ఇది తన స్నేహితురాలి సహాయం లేకుండా అయేపని కాదని తెలిసి, రాజకుమారుడు ఆమె కోసం ఎదురు చూసి, ఆమె రాగానే తాను చెయ్యవలిసిన పని చెప్పాడు. ఆమె పందుల కొట్టంలోకి వెళ్ళి, మూలనున్న కర్రతో అక్కడే ఉన్న పందిని పొడిచి, "పందీ, నాకు సహాయం చేస్తివా నిన్ను పారిపోనిస్తాను," అన్నది. పంది తాను పడుకున్న చోటు నుంచి లేస్తూండగానే స్నేహితులిద్దరూ దూరంగా పారిపోయారు. అసలే అక్కడ దుర్గంధం జాస్తిగా ఉన్నది. కొట్టం బాగుచేసేటప్పుడింకెంత దుర్గంధం బయలుదేరుతుందో తెలీదు.

కొంతసేపుండి వాళ్ళు తిరిగి వచ్చేసరికి పందుల కొట్టం రాణి భోజన శాలంత శుభ్రంగా ఉన్నది. దుర్గంధం ఏ మాత్రమూ లేదు. పని పూర్తిచేసి పారిపోతున్న పంది వారికి ఎదురయింది. సాయంకాలం దాకా కబుర్లు చెప్పుకున్న తరవాత రాజకుమార్తె వెళ్ళిపోయింది. కొంచెం సేపటికి రాణీ వచ్చి పందులకొట్టం పరీక్షించి, "ఇది నీ అంతట నువు చేసిన పనికాదు. అయినా నేను చెప్పిన పనులు మూడూ చేశావు గనక నేనన్న మాట ప్రకారం రాజకుమార్తెను పెళ్ళాడనిస్తాను. పెళ్ళి సామగ్రి అంతా మా అక్క అయిన వనరాణి దగ్గర ఉన్నది. నువు రేపే బయలుదేరి వెళ్ళి అది పట్టుకురా," అన్నది.

రాజకుమారుడు సంతోషించాడు. ఈ సముద్రరాణి తన స్నేహితురాలు చెప్పినంత చెడ్డది కాదని అతని కనిపించింది. వనరాణి వద్దకు ఎలా వెళ్ళాలో వివరంగా అతనికిచెప్పి సముద్రరాణి వెళ్ళిపోయింది. —(వచ్చే సంచికలో ముగింపు)





# మాయమైన బియ్యం

ఒక గ్రామంలో హయగ్రీవుడనే గృహస్థు ఉండేవాడు. అసలే దారిద్ర్యంతో బాధపడే హయగ్రీవుడికి అనారోగ్యం కూడా కలిగి, సంసారం వెళ్ళబుచ్చటం అసాధ్యమైపోయింది. భార్యా బిడ్డలూ పడుతున్న కష్టాలు చూడలేక అతను ఇల్లు విడిచి బయలుదేరాడు. ఎక్కడన్నా ఇంత సంపాదించ గలిగితేనే ఇంటికి తిరిగి రావాలనీ, లేకపోతే దేశాలు పట్టి పోవాలనీ అతని ఉద్దేశం.

బక్కచిక్కి బలహీనంగా ఉన్నవాడికెవరు పని ఇస్తారు? హయగ్రీవుడి కెక్కడా ఎలాటి పనీ దొరకలేదు. పూర్తిగా జీవితం మీద విరక్తి చెంది అతను ఒక అరణ్యంలో ప్రవహిస్తున్న నది వద్దకు వెళ్ళి, అందులో దూకేశాడు.

అ సమీపంలోనే తపస్సు చేసుకునే ముని ఒకడు ఇది చూసి, పరిగెత్తుకుంటూ వచ్చి, హయగ్రీవుణ్ణి నది నుంచి బయటికి లాగి, అతని విషాద గాథ విని, "నేను నీ కొక మంత్రం ఉపదేశిస్తాను. దాని సహాయంతో మూడు రోజులపాటు నువు కోరుకున్న ఆహారపదార్థాలు లభిస్తాయి. ఆటుతరవాత ఆ మంత్రం నీకు పారదు. అందుచేత దాన్ని మరెవరికన్నా ఇచ్చెయ్యి. మంత్రాన్ని ఇవ్వటానికి ఎవరూ దొరక్కపోతే దాన్ని అలాగే వదిలెయ్యి. మంత్రశక్తి నీ చేతిలో ఉన్న మూడు రోజులూ సత్తువ కలిగించే ఆహారాన్ని తిని, అలా సంపాదించుకున్న బలంతో పనిచేసుకో," అన్నాడు.

హయగ్రీవుడు సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చి, ముని చెప్పిన మంత్రం జపించి, తమ ఇంటికి ఆరోజు కావలిసిన బియ్యమూ, పప్పులూ, కాయగూరలూ, పాలూ, పెరుగూ, నెయ్యీ, వంటసామగ్రీ వగైరా కోరుకున్నాడు. మూడు రోజులపాటు హయగ్రీవుడి కుటుంబం కడుపునిండా

ఎస్. ఉమాదేవి



మంచి ఆహారం తిన్నారు. మూడో రోజున హయగ్రీవుడు మంత్రం జపించి, మరి మూడు రోజులకు సరిపడే ఆహారపదార్థాలు కోరుకుని నిలవచేశాడు.

మర్నాటి నుంచీ తన కా మంత్రం పని చెయ్యదు గనక, దాన్ని ఎవరి కిద్దామా అనుకుంటూండగా, మూడో నాటి సాయం కాలం ఒక బిచ్చగాడు ఆకలితో అతని ఇంటి ముందుకు వచ్చి, శోష వచ్చి పడిపో యాడు. హయగ్రీవుడికి ఆకలిశోష ఏమిటో తెలుసు, అందుచేత అతను ఆ బిచ్చగాడికి తెలివి తెప్పించి, తన ఇంట్లోకి తీసుకుపోయి భోజనం పెట్టాడు. తరవాత అత నా బిచ్చ

గాడికి తనకు తెలిసిన మంత్రం గురించి వివరంగా చెప్పి, ఆ మంత్రం సహాయంతో మూడు రోజుల పాటు సుఖంగా భోజనం చేసి బలం తెచ్చుకోమనీ, ఆ తరవాత మరెవరికన్నా ఉపదేశించమనీ అన్నాడు.

బిచ్చగాడు హయగ్రీవుడి వద్ద మంత్రం నేర్చుకుని వెళ్ళి, దాన్ని జపించి, ఒక బస్తా బియ్యం కావాలని కోరుకున్నాడు. మరుక్షణమే అతని గుడిసెలో ఒక బియ్యం బస్తా దభీమని పడింది. బిచ్చగాడి భార్య సంతోషంతో నాట్యం చేసింది. బిచ్చగాడు బస్తా నుంచి కొంత బియ్యం అంగడికి తీసుకుపోయి అమ్మి, ఆ డబ్బుతో ఇంటికి కావలిసిన వస్తువులు కొనుక్కొచ్చాడు.

ఈ మంత్రం ఇంకా రెండు రోజులపాటు తనకు పని చేస్తుంది; ఈ లోపుగా దాన్ని సద్వినియోగం చెయ్యటం ఎలాగా అని బిచ్చగాడు తన భార్యతో చర్చించాడు. మంత్రం మూడు రోజులూ తనకు ఉప యోగపడ్డాక వాడు దాన్ని తన భార్యకు చెప్పాలని రూఢి చేసుకున్నాడు. అందుచేత ఇంకా అయిదురోజుల పాటు ఆ మంత్రం తమ అధీనంలో ఉంటుంది.

ఆ భార్యాభర్తలు చాలా దురాశాపరులు. వాళ్ళకు ఊళ్ళోవాళ్ళ మీద కోపం కూడా





ఉన్నది; ఎందుకంటే వాళ్ళు తమకు రోజూ బిచ్చం వెయ్యరు, ఒక్కొక్కప్పుడు విసుక్కొని పొమ్మంటారు. ఈ మంత్రంతో తమ ఆశా, ఊళ్ళోవాళ్ళ మీద కసీ కూడా తీరాలని వాళ్ళు నిశ్చయించారు. అలా చెయ్యటానికి వా రుంటున్న గుడిసె పనికి రాదు, నిర్జన ప్రదేశం కావాలి. అరణ్యం మధ్య ఏనాటిదో ఒక పాడుపడిన పెద్ద భవనం ఉన్నది. దాన్ని బిచ్చగాడూ, వాడి భార్యా ఎరుగుదురు.

వాడు తన భార్యతో సహా ఆ భవనానికి చేరుకుని, మంత్రం చదివి, "మా ఊళ్ళో అందరి ఇళ్ళలోని బియ్యమంతా ఇక్కడికి చేరాలి," అని కోరుకున్నాడు.

వాడి భార్య వాడికన్న మూడాకు లెక్కువ చదివినది. మొగుడి నుంచి మంత్రం తనకు రాగానే ఆ ఆశాపాతకురాలు దేశంలోనూ, రాజభవనంలో సైతం, ఉండే బియ్యమంతా తెప్పించి, అరణ్యం మధ్యంలో ఉన్న ఆ పాడుబడిన భవనమంతా బియ్యంబస్తాలతో పేర్చినించింది. ఆ తరవాత మంత్రశక్తి పోయింది.

ఆ భార్యాభర్తలు తాము గొప్పపని చేసినట్టు ఆనందంలో మునిగితేలుతూంటే, దేశంలో బియ్యంగింజ లేక ప్రజలు హాహాకారాలెత్తిపోయారు. ఉన్నవారి గతీ, లేని వారి గతీ ఒకటే అయింది. ఆకలి తీర్చుకోవటానికి దొరికిన దుంపలూ, కాయగూరలూ, ఆకుఅలములూ తినవలిసిన దుస్థితి అందరికీ ఏర్పడింది. దేశంలో ఉండే బియ్యమంతా ఒక్కసారి ఎలా మాయమయిందా అని అందరూ ఆశ్చర్యపోయారు. ఈ రహస్యం తెలుసుకోవటానికి రాజుగారు నాలుగు మూలలకూ గూఢచారులను పంపాడు; ప్రజల కోసం అన్నంలేని సమారాధనలు చేయించాడు.

ఇంతలో ఒక విడ్డూరం బయలుదేరింది. ప్రతి ఇంటి నుంచీ ఎలుకలు బయలుదే



రాయి. బియ్యం మాయమయాక ప్రజలు తమ ఇళ్ళలో ఉండే అపరధాన్యాలన్నీ తినేశారు. అందుచేత ఇళ్ళలో ఉండే లక్షలాది ఎలుకలకు ఏ ఆహారమూ లేకుండా పోయింది. అందుచేత అవి వేలసంఖ్యలోనూ, లక్షల సంఖ్యలోనూ బయలుదేరి, తమకు ఆహారం ఎక్కడ దొరికేదీ తెలిసినట్టుగా ఒకే దిక్కుగా పోసాగాయి.

ఈ సంగతి తెలియగానే రాజుగారు ఆ ఎలుకల మందల వెనుకగా తన భటులను పంపాడు. ఎలుకల దండు వెళ్ళి, వెళ్ళి అరణ్య మధ్యంలో ఉన్న శిథిల భవనాన్ని చేరుకున్నాయి. కొందరు భటులు ఆ భవనాన్ని చుట్టుముట్టారు. మరి కొందరు లోనికి వెళ్ళారు. లోనికి వెళ్ళిన వారికి అద్భుత దృశ్యం కనబడింది. భవనం నిండా ఎక్కడ చూసినా బియ్యం బస్తాలే! అవి వేల సంఖ్యలో దొంతరలు దొంతరలుగా పేర్చి ఉన్నాయి.

రాజభటులను చూడగానే బిచ్చగాడూ, వాడి భార్యా పారిపోవాలని యత్నించి, భటులకు చిక్కిపోయారు. "మీ రిక్కడ ఎందుకున్నారు? మీ కీ బియ్యంబస్తా లెలా వచ్చాయి?" అని భటు లడిగితే ఆ దంపతులు ఏమీ చెప్పలేదు. అందుచేత భటులు వాళ్ళను తీసుకుపోయి రాజుగారి ఎదట పెట్టి, బియ్యంబస్తాల సంగతి చెప్పారు.

బిచ్చగాడు రాజుగారి దగ్గిర, తనకు హయగ్రీవుడు చెప్పిన మంత్రం గురించీ, దాని శక్తితో తాము అరణ్య మధ్యంలో బియ్యంబస్తాలు నిలవచేయటం గురించీ, చెప్పాడు. రాజుగారు హయగ్రీవుణ్ణి పిలిపించి విచారించగా, మంత్రం మాట నిజమేనని తేలింది. తరవాత రాజుగారు అరణ్య మధ్యం నుంచి బియ్యంబస్తాలు తెప్పించి, ఎవరు పోగొట్టుకున్న బియ్యం వారికి ఇప్పించి, బిచ్చగాణ్ణీ, వాడి భార్యనూ కారాగృహంలో పెట్టించాడు.





# దాచిన సొత్తు

ఒక గ్రామంలో ఒక గొప్ప ధనికుడుండే వాడు. ఆయనకు ముగ్గురు కూతుళ్ళుండే వాళ్ళు. మగపిల్లలు లేరు. ఆయన అంతు లేని ధనం కూడబెట్టాడని అందరూ చెప్పు కునేవారు.

ఆయన రోజూ బండి కట్టించుకుని రెండు గంటలసేపు పొలాల మధ్యగా తిరిగి ఇంటికి వస్తూండేవాడు. ఆ ప్రకారమే ఆయన ఒకనాడు సాయంకాలం తన బండి వాణ్ణి పిలిచి, "శివా, బండి సిద్ధంచెయ్యి," అన్నాడు. బండి తోలే శివుడు బండికి గుర్రాన్ని పూన్చి తెచ్చాడు. ధనికుడు అందులో ఎక్కి బయలుదేరాడు.

ఒక గంటసేపు గడిచాక శివుడు చీకటి పడబోతూండటం గమనించి, "బాబూ, బండి వెనక్కు మళ్ళించేదా?" అని అడిగాడు. బండిలోంచి జవాబు రాలేదు. శివుడు బండి ఆపి తన యజమానిని పరీక్షించి చూసి, ఆయన చచ్చిపోయినట్టు తెలుసుకున్నాడు.

ఇంటిపెద్ద ఇలా ఆకస్మిక మరణం పాలయేసరికి ఆయన భార్యా, కుమార్తెలూ గగ్గోలెత్తిపోయారు. ఆయన ఆస్తిపాస్తులకు సంబంధించిన వివరాలేవీ వారికి తెలియవు. అంతంకటె కూడా దారుణమైన సంగతేమిటంటే, ఆయన ఇనప్పెట్టెలో కొద్దిపాటి డబ్బే ఉన్నది. లోకమంతా అనుకునే దానిలో సహస్రాంశం కూడా లేదు.

ఈ పరిస్థితి చూసి ధనికుడి భార్య హతాశురాలైపోయింది. ఆమెకు ఏం చెయ్యటానికీ చెయ్యీ కాలూ ఆడలేదు. పెళ్ళిళ్ళు కావలిసిన ఆడపిల్లలు ముగ్గురున్నారు. బండి తోలే కుర్రవాడు శివుడు తప్ప మరొక మగదిక్కు లేదు. అందుచేతనే ఆమె వాణ్ణి వెంటనే ఉద్యోగం నుంచి తొలగించక, ప్రతిదానికీ వాడి పైనే ఆధారపడుతూ

ఆర్. జగన్మోహన్



వచ్చింది. తన యజమాని ఉత్తరక్రియలు జరపటానికి వాడు ఎంతో సహాయపడ్డాడు.

కొద్ది రోజులు గడిచాక ఒక రాత్రి ఇంట్లో ఎవరో నడుస్తున్నట్టు తపా తపా అడుగుల చప్పుడయింది. ధనికుడి భార్య అదిరిపడి నిద్ర లేచింది. వంటఇంట్లో పాత్రసామగ్రి ఎవరో గిరవాటు వేస్తున్నట్టు చప్పుళ్ళు వినిపించాయి. తరవాత తన భర్త వంటింటి నుంచి పడకగదిలోకి రావటం ఆమెకు కనిపించింది. ఆయన మంచాల మీది నుంచి పరుపులు ఈడ్చేశాడు, పెట్టెల మీద దబాదబా బాదాడు. ఆ తరవాత ఇంకొక గదిలోకి వెళ్ళిపోయాడు. ఈ విధంగా ఆయన ఇంట్లో ఉన్న గదులన్నీ తిరిగి, సామాన్లు విసిరి పారెయ్యటమూ, విరిచెయ్యటమూ, పగలగొట్టటమూ చేసి, తెల్లవారిన దాకా ఇల్లంతా హోరెత్తించేశాడు. తెల్లవార్లూ ఇంట్లో ఎవరికీ నిద్రలేదు సరేకదా, ప్రాణా లరచేత పెట్టుకుని కూర్చున్నారు.

ఉన్న కష్టాలకు తోడు ఇల్లు దయ్యాల కొంప అయిందని నలుగురికీ తెలిసిపోతుందని ధనికుడి భార్య చాలా భయపడింది. తెల్లవారగానే ఆమె శివుణ్ణి పిలిచి, రాత్రి జరిగిన దంతా చెప్పి, "నాయనా, ఎవరితోనూ చెప్పుకోవటానికి కూడా లేదు. ప్రతి రాత్రీ ఆయన దయ్యమై వచ్చి ఇల్లు ఒక కొలిక్కి తెచ్చేటట్టుంటే మేం ఎక్కడికన్నా పారిపోవలిసిందే తప్ప ఈ ఇంట ఉండలేం. ఈ అల్లరి తగ్గేదాకా రాత్రులు నువు కూడా యిక్కడే పడుకుంటే మా ఆడ వాళ్ళకు కాస్త ధైర్యంగా ఉంటుంది," అన్నది.

"బాబుగారు దయ్యమయ్యారా? కోరికలు మిగిలిపోయినవారు దయ్యా లవుతారంటారు. భయపడకండి. ఈ రాత్రి నేను మీకు తోడుంటాను," అన్నాడు శివుడు.

ఆ రాత్రి వాడు ఇంటివాళ్ళ పడకగదిలోనే ఒక మంచం కింద దాక్కున్నాడు. ఆ రాత్రి దయ్యం రానే వచ్చింది. అది

మొదట వంటఇంట్లో ప్రారంభించి, భయం కరమైన చప్పుళ్ళు చేస్తూ, వస్తువులు చిందరవందరగా చిమ్మేస్తూ ఇల్లంతా తెల్ల వారే దాకా తిరిగింది.

తెల్లవారి, దయ్యం ఆగడం నిలిచిపో యాక ధనికుడి భార్య శివుడితో, "చూశావు గదా, నాయనా? ఈయన ప్రతి రాత్రీ ఇలా చేస్తే మే మెలా బతకగలం? ఎవరినన్నా తోడు తెచ్చుకుందామన్నా, దయ్యాల కొంప అని తెలిస్తే ఎవరు వస్తారు? ఈ దయ్యం మాట పొక్కితే ఊళ్ళో ఎవరూ పగటి పూట కూడా ఆవరణలోకి అడుగు పెట్టరు గద!" అన్నది.

"భయపడకం డమ్మా. అయ్యగా రిలా చెయ్యటాని కేదో కారణం ఉంటుంది; తెలుసుకునేటందుకు ప్రయత్నిస్తాను. మీరు మాత్రం ఈ రాత్రికి మా ఇంటికి వెళ్ళి అక్కడ పడుకోండి. నన్ను ఒంటరిగా ఇక్కడ పడుకోనివ్వండి," అన్నాడు శివుడు.

ఆ రాత్రి వాడు తన యజమానురాలినీ, ఆవిడ కుమార్తెలనూ తన ఇంటికి పంపి, చీకటి పడగానే తాను తన యజమాని ఇంటి వంటగదిలో చేరాడు. రాత్రి ఒకజాము గడి చాక దయ్యం వచ్చి, అరుగు మీదా, అల మారులోనూ పేర్చిన గిన్నెలు వగైరా చిందరవందరగా చిమ్మసాగింది. శివుడు





కూడా గరిటెలూ, మూతలూ అటూ ఇటూ విసరసాగాడు.

దయ్యం ఇది గమనించి వాడికేసి తిరిగి, "నువురా, శివా? ఏం చేస్తున్నావిక్కడ?" అని అడిగింది.

"ఇప్పుడు నేను కూడా మీతోపాటేగా, బాబూ?" అన్నాడు శివుడు.

"ఏమిటీ? నువుకూడా చచ్చిపోయావా? నాకు తెలీదే?" అన్నది దయ్యం.

"తెలిసే వ్యవధి ఏదీ? నే పోయింది మొన్ననేగా?" అన్నాడు శివుడు.

"భేష్! ఒకరి కొకరం తోడుగా ఉన్నా మన్నమాట! పడక గదిలోకిపోయి అక్కడ అంతా చిందర వందర చేద్దాంపట్టు," అంటూ దయ్యం తలుపు కుండానే అవతలికి పోయింది. శివుడు మాత్రం తలుపు తెరిచి మళ్ళీ వెంటనే మూసి అవతలికి వెళ్ళి, దయ్యంతో బాటు తాను కూడా వస్తువులు గిరవాటు వెయ్యసాగాడు.

మధ్యలో ఆగి శివుడు, "అయితే, బాబూ మీ రిలా ఎందుకు చేస్తున్నట్టు?" అని అడిగాడు.

"ఏం చెప్పనురా, శివా? సామాన్ల కొట్టులో మూడు నాపరాళ్ళ కింద మూడు నిధులు పాతి పెట్టాను. ఒక కుండ నిండా బంగారమూ, ఒక కుండ నిండా వెండీ, మూడో కుండ నిండా రత్నాలు తాపిన నగలూ ఉన్నాయి. వాటి సంగతి నాకు తప్ప మరెవరికీ తెలీదు. అందుచేత బెంగ పడిపోయి, ఏం చెయ్యటానికి లేక ఇలా చేస్తున్నాను," అన్నది దయ్యం.

"అలా చెప్పండి. నేను నా జీవితంలో మిగిల్చి దాచిన నూరు వరహాల కోసమే అంత తపన పడుతూంటే అంత సొమ్ము గుప్తంగా దాచిన మీ రెంత తపన పడాలి!" అన్నాడు శివుడు.

"నువు కూడా డబ్బు పాతేశావా?" అన్నది దయ్యం.

"మన బండి ఉంచే చోట మూలలో నూరు వరహాలు పాతేస్తినిగా, బాబూ!" అన్నాడు శివుడు.

ఇల్లంతా అల్లకల్లోలం చేస్తూ ఇద్దరూ సామాన్ల గదిలోకి వచ్చాక, "ఇక్కడేనా, బాబూ, మీరు నిధి దాచిపెట్టింది?" అని అడిగాడు శివుడు.

"అవునురా. ఈ మూల నాపరాయి కింద బంగారం దాచాను, ఆ మూల రాయి కింద వెండి దాచాను, ఈ నడిమధ్య రాయి కింద నగకట్టు దాచాను. ఇదంతా అయిన వాళ్ళకు కాకుండా ఎవరికో అవుతుందని నా బెంగ!" అన్నది దయ్యం.

దయ్యం చూపిన నాపరాళ్ళు శివుడు గుర్తు పెట్టుకున్నాడు.

తెల్లవార వస్తుండగా దయ్యం, "శివా, ఇక మనం వెళ్ళిపోవాలి. ఇక్కడ ఉండ రాదు," అన్నది.

"మీరు వెళుతూ ఉండండి, బాబూ. నే నొక్కసారి బండి ఉన్న చోటికి పోయి నా నూరు వరహాలూ భద్రంగా ఉన్నదీ లేనిదీ చూసి, పరిగెత్తుకుంటూ వచ్చి మిమ్మల్ని కలుసుకుంటా. ఎవరైనా తవ్వుకు పోయారేమోనని నా బెంగ!" అన్నాడు శివుడు. దయ్యం శివుడి కోసం ఆగకుండా చీకటిలో పడి వెళ్ళిపోయింది.



తెల్లవారగానే ధనికుడి భార్యా, కూతుళ్ళూ తిరిగి ఇంటికి చేరుకున్నారు. శివుడు వాళ్ళకు రాత్రి జరిగినదంతా చెప్పి, వాళ్ళ ఎదటనే పలుగుతో నాపరాళ్ళను తవ్వి ఎత్తాడు.

దయ్యం చెప్పినట్టే వాటి కింద బంగారమూ, వెండీ, నగలూ దొరికాయి.

"ఇంక బాబుగారి దయ్యం మిమ్మల్ని బాధించదు. నాకు సెలవిప్పించండి," అన్నాడు శివుడు యజమానురాలితో.

ఆవిడ వాడితో, "అప్పుడే మమ్మల్ని వదిలేసి ఎలా పోతావు? రెండు మూడు రాత్రులైనా ప్రశాంతంగా గడవకపోతే మా ప్రాణా లెగిరిపోవా? రెండు రోజులు మాకు తోడు పడుకో. తరవాత సంగతి చూస్తాం," అన్నది.

శివుడు రెండు రోజులు తోడు పడుకున్నాడు. దయ్యం ఆ ఇంటి చాయలకు వచ్చినట్టు కనపడలేదు.

మూడో రోజున ధనికుడి భార్య, "శివా, నువు మాకు చేసిన మేలు ఎన్ని జన్మలకూ తీరేది కాదు. అందుచేత, ఒక ఆలోచన చేశాను. నా ముగ్గురు కూతుళ్ళూ పెళ్ళిళ్ళు చేసుకుని వెళ్ళిపోతే నేను ఒంటరిదాన్నయి పోతాను. అందుచేత ఒకతెనైనా నా వెంట ఉంచుకుందామని ఉంది. నా మూడో కూతురు నా కెక్కువ ఇష్టం. అది నీకు ఈడు కూడాను. దాన్ని నీ కిచ్చి చేస్తాను. ఇద్దరూ నా వెంటే ఉండండి. అందువల్ల నీకు నష్టం లేదు, నాకు లాభం," అన్నది.

మొదట శివు డీ ఆలోచనకు నిర్ఘాంత పోయాడు, కాని తన యజమాని ఆఖరు కూతురుకు తనంటే చాలా ఇష్టమని తెలిసిన మీదట పెళ్ళికి ఒప్పుకున్నాడు. ధనికుడి భార్య తన పెద్ద కూతుళ్ళిద్దరికీ మంచి సంబంధాలు చేసి, కాపరానికి పంపేసింది. శివుడు మూడోపిల్లను చేసుకుని ఆమెతో బాటు ఆ ఇంట్లోనే ఉండిపోయాడు.






రావణుడు వరుణలోకం నుంచి బయలుదేరి లంకకు తిరిగివస్తూ, దారిలో కనిపించిన అందగత్తెలైన కన్యలను వేలసంఖ్యలో చెరపట్టి తెచ్చి పుష్పకంలో ఎక్కించుకున్నాడు. వాళ్ళందరూ గొల్లున ఏడుస్తూ, రావణుణ్ణి శాపనార్థాలు పెట్టారు.

అతను ఇంటికి చేరుతూండగానే అతని చెల్లెలు శూర్పణఖ ఎదురువచ్చి, పెద్దపెట్టున ఏడుస్తూ, "ఏం చెప్పేది? నా భర్తను మిగిలిన కాలకేయులతో బాటు చంపి నన్ను విధవను చేసేశావు. బావమరిది అన్న జ్ఞానం కూడా నీకు లేకపోయింది," అని నిందించింది.

"అమ్మాయీ, జరిగినదానికి ఏడ్చి లాభమేమిటి? యుద్ధోన్మాదిగా ఉన్న సమయంలో, వీడు నా వాడన్న జ్ఞానం కూడా నాకు లేకపోయింది. ఇకముందు నువు మన ఖరుడి వెంట ఉండు. వాడు నీ కే కొరతా లేకుండా చూస్తాడు. పధ్నాలుగు వేల రాక్షసులకు వాణ్ణి నాయకుడుగా చేసి, దూషణుణ్ణి కూడా తోడిచ్చి దండకారణ్యాన్ని రక్షించటానికి పంపిస్తున్నాను. వాళ్ళంతా నీకు విధేయులై ఉండి, నువు కోరినట్టు చేస్తారు," అన్నాడు రావణుడు.

ఆ ప్రకారమే శూర్పణఖ ఖరదూషణుల వెంట దండకారణ్యానికి వెళ్ళి అక్కడ సుఖంగా జీవిస్తూ వచ్చింది.

తరవాత రావణుడు నికుంభిల వనానికి వెళ్ళి అక్కడ యజ్ఞం చేస్తున్న తన కుమారుణ్ణి, మేఘనాదుణ్ణి చూసి, కౌగలించు



కుని, "ఇక్కడ ఏం చేస్తున్నావు నువు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానం శుక్రాచార్యుడు చెప్పాడు: "నీ కొడుకు ఏడు యజ్ఞాలు తలపెట్టాడు. అగ్నిష్టోమమూ, అశ్వమేధమూ, రాజసూయమూ, గోమేధమూ, వైష్ణవమూ అన్నవి గాక, అత్యంత దుర్లభమైన మహేశ్వర యజ్ఞం చేసి శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, కామగమనం గల రథాన్నీ, అంతటా చీకటి ఆవరింప జేయ గల మాయనూ, శక్తివంతమైన ధనుర్బాణాలనూ వరంగా పొందాడు. ఇప్పుడు చేస్తున్నదే ఆఖరు యజ్ఞం."



శుక్రాచార్యుడు చెప్పిన ఈ మాటలతో ఏమాత్రమూ తృప్తిపడక రావణుడు, "మీరు చేసిన పని ఏమీ బాగాలేదు. మన శత్రువులైన ఇంద్రాదులను అర్చించటానికి ద్రవ్యం నష్టపరిచారు. సంపాదించిన పుణ్యం చాలు," అని మేఘనాదుణ్ణి తన వెంట తీసుకుపోయాడు.

అప్పుడు విభీషణుడు రావణుడి కొక దుర్వార్త చెప్పాడు. రావణుడికి చెల్లెలి వరస అయిన కుంభీనస అనే పిల్ల రావణుడి ఇంట పెరుగుతున్నది. రావణుడి తల్లికి పెదనాన్న అయిన మాల్యవంతుడి కూతురి కూతురు కుంభీనస. మధు వనే రాక్షసుడు వచ్చి, ఎవరూ లేని సమయంలో దాన్ని ఎత్తుకుపోయాడు. ఆ సమయంలో రావణుడు దిగ్విజయం వెళ్ళి ఉన్నాడు, కుంభకర్ణుడు నిద్రపోతున్నాడు, విభీషణుడు నీటిలో మునిగి తపస్సు చేసుకుంటున్నాడు.

తాను ఎందరు కన్యలను అపహరించి తెచ్చినా తన చెల్లెలిని ఎవరో అపహరించారనే సరికి రావణుడు మండి పడ్డాడు. అతను కుంభకర్ణుణ్ణి నిద్ర లేపించి, రాక్షస వీరులనూ, సైనికులనూ యుద్ధానికి సిద్ధం చేయించి, మధువు వుండే మధుపురం మీదికి వెళ్ళాడు.





తన భర్తను చంపటానికి తన అన్న అయిన రావణుడు పెద్ద సేనతో వస్తున్నాడని తెలిసి, కుంభీనస ఏడుస్తూ అతనికి ఎదురు వచ్చి, "అన్నా, నీ బావమరిదిని చంపి నాకు వైధవ్యం కలిగించకు," అని బతిమాలింది.

రావణుడు కుంభీనస దైన్యానికి కరిగి, "నీ భర్తను చంపనులే. అతను ఎక్కడ ఉన్నాడో చూపించు. నేను దేవతలను జయించటానికి స్వర్గానికి వెళుతున్నాను. అతన్ని కూడా వెంట తీసుకుపోతాను," అని చెప్పాడు.

కుంభీనస తన భర్త అయిన మధువు వద్దకు వెళ్ళి, "మా అన్న నిన్ను దేవతలతో యుద్ధం చెయ్యటానికి పిలుస్తున్నాడు, వెళ్ళు. అలాటి వాడి స్నేహం మనకు చాలా మంచిది," అని చెప్పింది.

మధువు రావణుడి వద్దకు వచ్చి, అతన్ని అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, ఎన్నో మర్యాదలు చేశాడు.

రావణుడు ఒక్క రాత్రి తన బావమరిది ఆతిథ్యం స్వీకరించి, మర్నాడు బయలుదేరి వైశ్రవణు డుండే కైలాసం వద్దకు చేరుకున్నాడు. అప్పటికి సాయంకాలం కావటం చేత రావణుడి సేన అక్కడే విడిసింది.



ఆ రాత్రి చంద్రుడు చక్కటి వెన్నెల కాస్తున్నాడు. చల్లని మందమారుతం వీస్తున్నది. చెట్ల మధ్య కిన్నరులు బృంద గానాలు చేస్తున్నారు. కుబేరుడి మందిరంలో అప్సరసలు పాడే పాటలు వినవస్తున్నాయి. అంతటా పూలు వాసనలు వెదజల్లుతున్నాయి, కొండ మీద కూర్చుని వెన్నెలలో చుట్టూ ఉండే దృశ్యాలు చూస్తున్న రావణుడికి విరహబాధ పుట్టుకొచ్చింది.

ఆ సమయంలో అప్సరస లందరిలోకీ మిన్న అయిన రంభ, నిద్రలో మునిగి ఉన్న రావణుడి సేనల మధ్యగా నడుచుకుంటూ అటుగా వచ్చింది. ఆమె దివ్యాభర





ణాలు ధరించి, దివ్య పుష్పమాలలు వేసుకుని, తలలో మందారాలు పెట్టుకుని, నల్లని ముసుగు వేసుకుని, రెండో లక్ష్మీదేవి లాగా రావటం చూసి రావణుడు కూర్చున్న చోటి నుంచి లేచి వెళ్ళి, ఆమె చెయ్యి పట్టుకుని, "ఇప్పుడు నువు ఎవరి దగ్గిరికి పోతున్నావు? ఎవడా అదృష్టశాలి? నేను తక్కువ వాణ్ణి కాను. మూడు లోకాలలోనూ నన్ను మించినవాడు లేడు. నిన్ను చేతులుమోడ్చి వేడుకుంటాను. నా కోరిక తీర్చి వెళ్ళు," అన్నాడు.

రంభ అతని మాటలు విని వణికిపోతూ, "మీరు నాతో ఇలా మాట్లాడకూడదు. నాకు ఇతరులు బాధ కలిగిస్తే రక్షించవలిసిన వారు. నేను మీకు కోడలు వరస దాన్ని. మీ అన్న కొడుకు నలకూబరుడు నా కోసం వేచి ఉన్నాడు. నే నతన్ని తప్ప మరెవ్వరినీ ప్రేమించలేను," అని వేడుకున్నది.

"మీ అప్సరసలకు మొగుడూ, వావి వరసలూ ఎక్కడివి?" అంటూ రావణుడు రంభను బలాత్కరించాడు.

రంభ నలిపివేసిన పువ్వు లాగానూ, తెంపివేసిన లత లాగానూ అయిపోయి, పుట్టెడు సిగ్గుతోనూ, భయంతోనూ, దుఃఖంతోనూ వెళ్ళి నలకూబరుడి కాళ్ళ మీద పడి రావణుడు తనకు చేసిన అన్యాయం గురించి చెప్పింది.

నలకూబరుడు కోపోద్రేకంతో జలం స్పృశించి, "ఈ రావణుడు ఇక ముందు తనను కోరని స్త్రీని బలాత్కరించే పక్షంలో వాడి తల వెయ్యి ముక్కలవుతుంది," అని శపించాడు.

ఈ శాపం సంగతి విన్నాక రావణుడు చెరబట్టి తెచ్చిన స్త్రీలలో పతివ్రత లైన వాళ్ళు పరమానందం చెందారు. రావణుడు కూడా అదిమొదలు స్త్రీలను బలాత్కరించటం మానుకున్నాడు.



రావణుడు కైలాసం నుంచి బయలుదేరి తన సైన్యాలను స్వర్గం పైకి నడిపించుకు వెళ్ళాడు. రాక్షససేన నాలుగు వైపుల నుంచీ స్వర్గాన్ని ముట్టడించుతున్న దన్న వార్త విని, ఇంద్రుడు దేవగణాలను యుద్ధానికి సిద్ధం కమ్మని హెచ్చరించి, విష్ణువు వద్దకు వెళ్ళి, "రావణుడు దండెత్తి వచ్చాడు. ఏం చేసేటట్టు? నీ సహాయంతో పూర్వం ఎందరో రాక్షసులను జయించాను. చక్రం పట్టుకుని వెళ్ళి రావణుడితో యుద్ధం చేస్తావా?" అని అడిగాడు.

"నే నిప్పుడు వాడితో యుద్ధం చెయ్యను. వాడు మన చేతిలో చావడు. వాడి కింకా కాలం తీరలేదు. ప్రస్తుతానికి నువే వాణ్ణి ఎదిరించు. నీ కేమీ భయం లేదు," అన్నాడు విష్ణువు.

దేవతలకూ, రాక్షసులకూ గొప్ప యుద్ధం జరిగింది. రావణుడి బలాలకు అతని తాత అయిన సుమాలి నాయకత్వం వహించి, ఈ యుద్ధంలో సావిత్రుడనే వసువు చేతిలో చనిపోయాడు. రాక్షస సేన కూడా బాగా దెబ్బతిన్నది. పదింట తొమ్మిది వంతుల మంది రాక్షసులు చచ్చారు. ఇంద్రుడు గొప్పగా యుద్ధం చేసి రావణుణ్ణి ప్రాణాలతో పట్టుకున్నాడు. ఈ సంగతి తెలిసి



మేఘనాదుడు తన మాయను ప్రయోగించి, అదృశ్యుడుగా యుద్ధం చేస్తూ వచ్చి, ఇంద్రుణ్ణి పట్టుకుని తన తండ్రిని విడిపించి, "యుద్ధం అయిపోయింది. మనం గెలిచాం. ఇదుగో, ఇంద్రుడు మనకు చిక్కాడు. నువు యథేచ్ఛగా మూడు లోకాలూ ఏలుకోవచ్చు," అన్నాడు.

ఇంద్రుణ్ణి పట్టుకుని మేఘనాదుడు ఇంద్రజిత్తు అయాడు. తన కొడుకునూ, పట్టుబడిన ఇంద్రుణ్ణీ తీసుకుని రావణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. ఇంద్రుణ్ణి విడిపించటానికి దేవతలు బ్రహ్మను వెంట బెట్టుకుని లంకకు వెళ్ళారు. బ్రహ్మ కొలు





వులో ఉన్న రావణుడితో, "నీ కొడుకు పరాక్రమం నిజంగా చాలా గొప్పది. దాన్ని చూసి నేను సంతోషించాను. ఇక నుంచీ నీ కొడుకు ఇంద్రజిత్తు అనే పేరుతో ప్రఖ్యాతి పొందుతాడు. వాణ్ణి ఎవరూ జయించలేరు. వాడి సహాయంతో దేవతలను జయించావుగద, ఇక ఇంద్రుణ్ణి విడిచిపెట్టెయ్యి," అన్నాడు.

"తాతా, ఇంద్రుణ్ణి విడిచిపెట్టే తీరాలనే పక్షంలో నాకు అమరత్వం ఇయ్యి," అన్నాడు ఇంద్రజిత్తు.

"నాయనా, ఏ ప్రాణికీ పరిపూర్ణమైన అమరత్వం లేదు," అన్నాడు బ్రహ్మ.

"అలా అయితే, నాక్కూడా పరిపూర్ణమైన అమరత్వం వద్దు. నేను నీకు తృప్తి కలిగే లాగా రోజూ అగ్నిని మంత్రాలతోనూ, హవ్యాలతోనూ అర్చిస్తాను. నేను యుద్ధానికి బయలుదేరే ముందు గుర్రాలు పూన్చిన రథం అగ్ని నుంచి రావాలి; దాని పైన నే నున్నంతసేపూ నాకు అమరత్వం ఉండాలి. ఇదే నేను కోరే వరం. నేను అగ్నిని అర్చించటం పూర్తికాని పక్షంలో చస్తే చస్తానుగాక," అన్నాడు ఇంద్రజిత్తు.

బ్రహ్మ దీనికి ఒప్పుకున్న మీదట అతను దేవేంద్రుణ్ణి విడిచిపెట్టేశాడు. ఇంద్రుడితో సహా దేవతలు స్వర్గానికి వెళ్ళిపోయారు.

యుద్ధోన్మాదంతో రావణుడు భూలోకం పర్యటించేటప్పుడు అతనికి కొన్ని అపజయాలు కూడా కలిగాయి. వాటిని గురించి కూడా అగస్త్యమహాముని రాముడికి చెప్పాడు.

వెయ్యి చేతులు గల కార్తవీర్యార్జునుణ్ణి గెలవాలనే ఉద్దేశంతో రావణుడు తన పరివారాన్ని వెంటబెట్టుకుని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు. అర్జునుడు ఆ రోజే తన భార్యలతో సహా నర్మదానదిలో జలక్రీడలాడటానికి బయలుదేరి వెళ్ళినట్టు తెలిసింది.



రావణుడు సపరివారంగా తాను కూడా నర్మదానదికి వెళ్ళి, అక్కడ స్నానం చేసి శివపూజ చెయ్యటానికి కూర్చున్నాడు. అతని మంత్రులు పూజా పుష్పాలు తెచ్చి నదీతీరాన పెద్ద పోగు పోశారు. రావణుడు తన వెంట ఎప్పుడూ ఉండే బంగారు లింగాన్ని ఒక ఇసుక తిన్నె మీద పెట్టి, అర్చించి, దాని ముందు పాడుతూ నాట్యం చెయ్యసాగాడు.

నర్మదానది తూర్పు నుంచి పడమరగా ప్రవహించి, పడమటి సముద్రంలో పడుతుంది. అలాటి నది ఇప్పుడు పడమర నుంచి తూర్పుగా ప్రవహించసాగింది. అంతే గాక నది అంతకంతకూ పొంగి, రావణుడు పూజించిన పుష్పాలను తనతోబాటు తీసుకుపోయింది. అది చూసి రావణుడు చిటికెలు వేసి శుకసారణులను పిలిచి, నర్మద ఎదురు ప్రవహించడానికి కారణం తెలుసుకు రమ్మన్నాడు.

వాళ్ళు వెళ్ళి చూసేసరికి కార్తవీర్యార్జునుడు తన భార్యలతో జలక్రీడ లాడుతూ కనిపించాడు. అతను తన వెయ్యిచేతులతోనూ నదీ ప్రవాహాన్ని అడ్డేసరికి, నది పొంగి ఎదురు ప్రవహించుతున్నది. శుకసారణులు తిరిగి వచ్చి రావణుడితో ఈ సంగతి



చెప్పారు. వాళ్ళు వర్ణించిన "మహావృక్షం" లాటి మనిషి కార్తవీర్యార్జునుడే అయి ఉంటాడని గ్రహించి రావణుడు యుద్ధానికి బయలుదేరి వచ్చి, కార్తవీర్యార్జునుడి మంత్రులతో, "రావణుడు యుద్ధానికి పిలుస్తున్నాడని మీ రాజుతో చెప్పండి," అన్నాడు.

"యుద్ధానికి మంచి సమయం చూశావే! రాజు స్త్రీలతో జలక్రీడ లాడేటప్పుడు యుద్ధానికి పిలుస్తారా? రేపు వచ్చి నీ చేతుల తీట తీర్చుకో," అన్నారు మంత్రులు. కాని రావణుడు అప్పుడే యుద్ధం కావాలన్నాడు. కార్తవీర్యార్జునుడి మంత్రులు తమతో ముందు యుద్ధం చెయ్యమన్నారు.



ఉభయపక్షాల వారికీ యుద్ధం జరిగింది. రాక్షసులు విజృంభించి అర్జునుడి పరివారంలో చాలా మందిని చంపారు, కొందరిని తిన్నారు కూడా. ఈ యుద్ధపు కోలాహలం విని కార్తవీర్యార్జునుడు తన భార్యలకు భయపడ వద్దని చెప్పి, గద తీసుకుని, దాన్ని తన అయిదువందల చేతులతోనూ, గిర గిరా తిప్పుతూ, యుద్ధం జరిగే చోటికి వచ్చాడు. ప్రహస్తుడు ముసలం తీసుకుని అతని దారికి అడ్డంగా నిలబడ్డాడు. అర్జునుడు ప్రహస్తుడు విసరిన ముసలాన్ని తన గదతో విరగగొట్టి అతని వెంటపడ్డాడు. గదతో కొట్టిన దెబ్బలకు ప్రహస్తుడు పడిపోగానే మారీచ శుకసారణ ధూమ్రాక్ష మహోదరులు మొదలైనవారు పారిపోయారు.

ఆ తరవాత రావణుడు అర్జునుడితో యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ గదలతో ఒకరి నొకరు మోదుకున్నారు, కాని కొంతల్లాగా ఏ ఒకరూ చలించలేదు. చిట్టచివరకు అర్జునుడు బలం కొద్దీ తన గదతో రావణుడి రొమ్ము మీద కొట్టే సరికి, అది తుంపులు తుంపులై పోయింది. అయితే ఆ దెబ్బతో రావణుడు వివశుడై పడిపోయాడు. వెంటనే అర్జునుడు రావణుణ్ణి పట్టి కట్టేసి, తన పట్టణానికి తీసుకుపోయాడు.

ఈ సంగతి స్వర్గంలో ఉన్న పులస్త్య బ్రహ్మకు తెలిసింది. ఆయన మాహిష్మతికి అదరాబాదరా వచ్చాడు. కార్తవీర్యార్జునుడు ఆయనకు ఎంతో భక్తిగా అతిథిసేవ చేసి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నాయనా, లోకాలన్నీ జయించి అజేయుడనిపించుకున్న నా మనమణ్ణే గెలిచావు. ఏమి నీ పరాక్రమం! ఏమి నీ కీర్తి! వాణ్ణి విడిచిపెట్టెయ్యి," అన్నాడు పులస్త్యుడు.

కార్తవీర్యార్జునుడు మారు మాటాడక రావణుడి కట్లు విప్పి, అగ్నిసాక్షిగా అతనితో అహింసాస్నేహం చేసుకుని, వస్త్రాభరణాలు కానుకగా ఇచ్చి పంపేశాడు.






జటాసురుడి కొడుకు శంబరాసురుడు. కృష్ణుడికీ, రుక్మిణికీ పుట్టిన కుమారుడి చేత శంబరుడికి చావున్నదని అశరీరవాణి పలికింది. ఇది విని శంబరుడు కాకి రూపంలో ద్వారకకు వెళ్ళి, ఎనిమిది రోజుల వయసుగల ప్రద్యుమ్నుణ్ణి ఎత్తుకుపోయి సముద్రంలో పారేసి, తన దారిన తాను ఇంటికి వెళ్ళిపోయాడు.

శివుడు దహించగా బూడిద అయిపోయిన మన్మథుడు రుక్మిణీకృష్ణులకు కొడుకై పుట్టాడు. మన్మథుడి భార్య అయిన రతీదేవి శంబరుడికి కుమార్తెగా జన్మించింది. ఆమె పేరు మాయావతి. శంబరుడు సముద్రంలో పారేసిన ప్రద్యుమ్నుణ్ణి ఒక పెద్ద చేప మింగింది. ఆ చేప ఒక జాలరివాడికి దొరికింది. అది చాలా పెద్ద చేపగా ఉండటం చేత ఆ జాలరి ఆ చేపను శంబరుడి కుమార్తె అయిన మాయావతి కిచ్చాడు. ఆమె ఆ చేపను తరిగి లోపల పిల్లవాడు ఉండటం చూసి, అతన్ని రహస్యంగా పెంచింది. తనను చంపటానికి పుట్టిన ప్రద్యుమ్నుడు తన ఇంటనే, తన కుమార్తె చాటున పెరుగుతున్నాడని తెలిసి శంబరుడు అతన్ని చంపబోయాడు. కాని ఇద్దరికీ జరిగిన యుద్ధంలో శంబరుడే ప్రద్యుమ్నుడి చేతిలో చచ్చాడు.

మాయావతి ప్రద్యుమ్నుడికి తమ ఇద్దరి పూర్వజన్మ వృత్తాంతం చెప్పి, కొంత కాలం అతనికి భార్యగా ఉండి, తరవాత అతన్ని ద్వారకలో చేర్చింది.

రుక్మిణి అన్న అయిన రుక్మికి రుక్మవతి అనే కుమార్తె ఉండేది. ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశారు. దానికి మిగిలిన రాజులతో బాటు ప్రద్యుమ్నుడు కూడా వెళ్ళాడు. కాని స్వయంవరం జరగక ముందే అతను మిగిలిన రాజకుమారు

అట్ట చివరి బొమ్మ



లంతా చూస్తూండగానే రుక్మవతిని తన రథం పైన ఎక్కించుకుని తీసుకువచ్చి పెళ్ళాడాడు. కొంత కాలం జరిగాక వారిద్దరికీ అనిరుద్ధుడు పుట్టాడు.

• వజ్రపురాన్ని వజ్రనాభు డనే దానవుడు ఏలుతూ ఉండేవాడు. ఇతను తన తపస్సుతో బ్రహ్మను మెప్పించి, దేవతలు తనను గెలవలేకుండానూ, తన అనుమతి లేక ఎవరు గాని వజ్రపురం ప్రవేశించ లేకుండానూ వరం పొందాడు. ఈ విధంగా వరం పొందిన ధైర్యంతో వజ్రనాభుడు దేవతలను అదేపనిగా పీడిస్తూ, తనకు స్వర్గాధిపత్యం ఇయ్యమని ఇంద్రుణ్ణి బాధించాడు. ఇతనితో యుద్ధానికి తలపడే ధైర్యం ఇంద్రుడికి లేకపోయింది. అందుచేత అతను కశ్యపుడి సలహా తీసుకుని, అతను ఎలా చెయ్యమంటే అలా చేస్తానన్నాడు. ఇందుకు వజ్రనాభుడు కూడా ఒప్పుకున్నాడు. ఆ మీదట ఇంద్రుడు రహస్యంగా కృష్ణుడితో మంతనాలు జరిపి, ఎలాగైనా వజ్రనాభుణ్ణి చంపమని మతిమాలుకున్నాడు. ఆ పని తన కొడుకైన ప్రద్యుమ్నుడు చేస్తాడని కృష్ణుడు ఇంద్రుడికి మాట ఇచ్చాడు.

వజ్రనాభుడికి ప్రభావతి అనే కుమార్తె ఉండేది. ఆమెకు ప్రద్యుమ్నుడి పైన మోహం పుట్టించి, తద్వారా ప్రద్యుమ్నుణ్ణి వజ్రపురం లోపలికి చేర్చటానికి ఇంద్రుడు ఎత్తువేశాడు. అతను శుచిముఖి అనే ఆడ హంసను ఈ పనికి నియోగించాడు. ఆ హంసి ప్రభావతి ఉండే ఉద్యానవనానికి వెళ్ళి, అపర మన్మధుడైన ప్రద్యుమ్నుడి అందాన్ని వర్ణించి, ప్రభావతిని ప్రేమోన్మాదంలో పడేలాగా చేసింది. ఎలాగైనా సరే ఆ ప్రద్యుమ్నుడికి తన పైన ప్రేమ పుట్టేటట్టు చేసి, తన వద్దకు అతన్ని చేర్చమని ప్రభావతి ఆ హంసిని వేడుకున్నది.



శుచిముఖి అనే ఆ హంసి ప్రద్యుమ్నుడి వద్దకు వెళ్ళి, "నీ వల్ల ఒక మహాకార్యం జరగవలిసి ఉంది. వజ్రనాభుణ్ణి నీ చేత చంపించటానికి నీ తండ్రి అయిన కృష్ణుడికీ, ఇంద్రుడికీ రహస్య సంభాషణలున్నాయి. వజ్రనాభు డుండే వజ్రపురం చేరినట్టయితే నీకు మరొక శుభం కూడా చేకూరుతుంది. వజ్రనాభుడి కుమార్తె ప్రభావతి త్రిలోకసుందరి," అంటూ ఆమె అందాన్ని పొగడింది.

హంసి చెప్పిన మాటలు ప్రద్యుమ్నుడికి అంతగా తల కెక్కలేదు. కాని ఆ హంసి వెళ్ళిపోయినాక, ప్రభావతి అందం గురించి తాను విన్న మాటలు తలుచు కుంటూంటే అతనికి ఆమె పైన కోరిక హెచ్చసాగింది. అప్పుడతను తన కోరికను ఒక చిలుక ద్వారా శుచిముఖికి తెలుపుతూ ఒక ఉత్తరం రాసి పంపాడు.

శుచిముఖి వజ్రనాభుడి వద్దకు వెళ్ళి, భద్రు డనే గొప్ప నటుడున్నాడనీ, అతని నటన చూడని జన్మ నిష్ఫలమనీ చెప్పింది. వజ్రనాభుడి కా భద్రుడి నటన చూడాలని కుతూహలం కలిగింది. ఆ నటుణ్ణి తీసుకు రమ్మని అతను హంసితో అన్నాడు. శుచిముఖి ప్రద్యుమ్నుడికి భద్రుడనే పేరు పెట్టి నటుడి వేషంలో వజ్రపురం చేర్చింది.

తన పురంలోకి తన అనుమతి లేకుండా ఎవరూ రాలేకుండా వరం పొంది కూడా, శుచిముఖి పన్నిన వలలో పడి, తన మృత్యు రూపంలో ఉన్న ప్రద్యుమ్నుణ్ణి ఆ వజ్రనాభుడు తానే ఆహ్వానించాడు.

ప్రద్యుమ్నుడు వజ్రనాభుడి ముందు ఆడుతూ, పాడుతూ, తాను ఆ రాత్రి ప్రభావతిని కలుసుకో బోతున్నట్టు అర్థం వచ్చేటట్టుగా మాట్లాడాడు. ఆ సంకేతం ప్రభావతి గ్రహించింది గాని వజ్రనాభుడు గ్రహించలేదు. ఆ సాయంకాలం ప్రభావతి అంతఃపురానికి తీసుకుపోబడుతున్న పూలలో ప్రద్యుమ్నుడు తుమ్మెద రూపంలో దాగి ఉండి, ప్రభావతి ఒంటరిగా ఉన్న సమయంలో తన అసలు రూపంతో ప్రత్యక్షమయాడు. వారిద్దరూ గాంధర్వ వివాహం చేసుకున్నారు.

అది మొదలు ప్రద్యుమ్నుడు రహస్యంగా అక్కడే ఉండిపోయాడు. కొంత కాలానికి ప్రభావతి గర్భవతిగా ఉండి, ఒక కొడుకును కన్నది. వాడి పేరు ప్రభావంతుడు.

ఇంతకాలం గడిచాక వజ్రనాభుడికి తన నగరం లోకి పరాయి వాళ్ళు ప్రవేశించి, అక్కడ ఉంటున్నట్టు తెలియ వచ్చింది. అంతఃపురంలో రహస్యంగా ఉంటున్న వాళ్ళను పట్టుకోమని అతను తన సేనాపతులను పంపాడు. ప్రద్యుమ్నుడికీ వజ్రనాభుడి పక్షానికీ పెద్ద యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ప్రద్యుమ్నుడు ఇంద్రుడి సహాయం పొంది, వజ్రనాభుణ్ణి చంపేశాడు. దేవతల చేతిలో ఓడకుండా వరం పొందిన వజ్రనాభుడు చివరకు మనిషి చేతిలో ప్రాణాలు విడిచాడు.

తరవాత ప్రద్యుమ్నుడు తనకు ప్రభావతి యందు పుట్టిన ప్రభావంతుణ్ణి వజ్రపురానికి రాజుగా అభిషేకించి, తాను ప్రభావతీ సమేతుడై ద్వారకకు తిరిగి వెళ్ళిపోయాడు.



# 50. ప్రాచీనమైన సైప్రస్ వృక్షాలు

మెక్సికో లోని ఈ సనాతన వృక్షాలు, కాలిఫోర్నియాలోని రెడ్‌వుడ్ వృక్షాలలాగే, అసాధారణమైనవి. ఒకప్పుడు టెక్సకోకో సరస్సుతీరాన ఈ చెట్లు మహారణ్యంగా ఉండేవనీ, ఇప్పుడు వాటి తోపులు అక్కడక్కడా మిగిలాయనీ చెబుతారు. ఒక తోపులో 200 సైప్రస్‌ల మధ్య 175 అడుగుల ఎత్తూ, 50 అడుగుల కాండపు చుట్టుకొలతా గల చెట్టున్నది. దాని వయసు 700 సంవత్సరాలని చెబుతారు.



Photo by Ranbir S. Bakhshi



బహుమతి
పొందిన వ్యాఖ్య

సేవకుని ధ్యానం

పంపినవారు:
ఎ. పి. పద్మ, గుంటూరు

Photo by H. G. Damodardas



బహుమతి
పొందిన వ్యాఖ్య

యజమాని స్నానం

పంపినవారు :
ఎ. పి. పద్మ, గుంటూరు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 మార్చి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సేవకుని ధ్యానం

రెండవ ఫోటో : యజమాని స్నానం

పంపినవారు : ఎ. పి. పద్మ,

బ్రాడీపేట, గుంటూరు-2

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండ జలుబుకు, సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాల చేరిన మందు. కండనొప్పికి, తలనొప్పికి, బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించ వలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికల్లా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాల చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ



అన్ని పనులూ
నా
తలమీదే!
ఇంట్లో అన్ని పనులూ
నేనే చేయాలి. పిల్లల్ని
చూసుకోవడమూ, యింటిపనీ,
వంటపనీ అన్నీను. కాని నేను
ఎంతో నీరసముగా ఉండి ఏ పనీ
చేసుకోలేకపోయేదాన్ని...




తరువాత,
ఒక రోజున మా
ఆయన హార్లిక్స్
తెచ్చి నన్ను త్రాగ
మన్నారు. అది
నాకు మళ్ళీ శక్తి
ఉత్సాహములను
కలిగిస్తుందన్నారు.




హార్లిక్స్
పుచ్చుకొని
నేను ఎంతో
శక్తి ఉత్సాహము
లను పొందేను.
హార్లిక్స్ కలిగించిన
మార్పును నాకే
ఆశ్చర్యము
కలిగించింది!
Horlicks
తగినంత పోషణలేని కారణ
ముగా అలసట విసుగుదల
తో ఉన్న సమయాల్లో
డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు
చేస్తారు. ఎందుకంటే పూర్తి
మీగడగల పాలతో
గోధుమపిండి, మాల్టెడ్
బార్లీల పోషకయోగం హార్లిక్స్
మళ్ళీ శక్తిని పొందుటలో
దివ్యముగా సహాయపడు
తుందని వారికి తెలియును.
హార్లిక్స్
అదనపు శక్తిని
కలిగించును!


మానవసేవే మాధవసేవ!







CHANDAMAMA (Telugu) JANUARY 1966 Regd. No. M. 4854



ప్రద్యుమ్నుడి కథ